

## ఇందులో :

★




16

1 – 6 – 49



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

సంచిక 16 | 1—6—1949 | వెల: 8 అణాలు

# శాంతి సంస్కృతుల సంరక్షణ

ప్రపంచశాంతికి, సంస్కృతికీ నేడు ప్రమాదం ఏర్పడింది. రెండవ ప్రపంచ యుద్ధగాయాలింకా మానకముందే అమెరికా ఆధ్వర్యాన ప్రపంచ సామ్రాజ్యవాదులు మూడో ప్రపంచయుద్ధానికి తీవ్రసన్నాహాలు చేస్తూవున్నారు.

లక్షలకొలది ప్రజలు — ముఖ్యంగా వీర సోవియట్ ప్రజలు తమరక్తాన్ని ధారవోసి, తమ సర్వస్వం త్యాగంచేసి ప్రపంచ శాంతి నెలకొల్పారు ఫాసిస్టు దాస్యంనుంచి దేశాలను విముక్తంచేశారు.

ప్రపంచాధిపత్యంకోసం అర్రులుజాస్తూవున్న ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులముఠా నేడు ఒక బ్రహ్మాండమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటుంది. సోవియట్ నాయకత్వాన దినదిన ప్రవర్ధమానమవుతూ తమసామ్రాజ్య విస్తరణకు పెద్ద ప్రతిబంధకంగావున్న శాంతికాముక ప్రజాస్వామిక శక్తుల ప్రాబల్యాన్నిచూచి అమెరికాకు గంగవెర్రులెత్తుతున్నాయి. తమ వలసదేశాలనూ, మార్కెట్లనూ తమ గుప్పిట్లోనుంచి జారిపోకుండా నిలబెట్టుకోడానికీ, తమ అధికారాన్ని ఇంకా విస్తృతం చేసుకోడానికి, సోషలిజంవైపు పురో[illegible]ే ప్రపంచ ప్రజాశక్తుల నరికట్టడానికీ సామ్రాజ్యవాదులు ప్ర[illegible]ో మారణ

హోమంలోకి యీడుస్తున్నారు. మరో ప్రపంచయుద్ధానికి సన్నద్ధు లవుతున్నారు.

సోవియట్ యూనియన్‌కూ, స్వాతంత్ర్యకాముక దేశాలకూ జాతులకూ వ్యతిరేకంగా రేడియోలూ, పత్రికలూ వగైరా సకల ప్రచార సాధనాలద్వారా ద్వేషాన్నీ యుద్ధాన్నీ రెచ్చగొడుతూ విప రీత ప్రచారం సాగిస్తున్నారు. ఆయుధ నిర్మాణం అతి జోరుగా సాగి పోతూఉంది. ఆగ్నేయ ఆసియా దేశాల్లో వలస యుద్ధాలు నడిపిస్తు న్నారు. చైనా, గ్రీసు, పోర్చుగల్, స్పెయిన్ దేశాల్లో పతనమై పోతూఉన్న ఫాసిస్టు ప్రభుత్వాలను నిలబెట్టడానికి నానావస్థ పడు తున్నారు. ఎంతటి దుర్మార్గానికైనా ఒడిగడుతున్నారు యుద్ధ ప్రచార దశనుండీ, ఆటంబాంబులనుచూపి భయపెట్టే దశనుండీ దాటి అట్లాం టిక్ సంధిరూపంలోనూ, పసిఫిక్‌సంధి, మధ్యధరా సంధికోసం జరిపే ప్రయత్నాల్లోనూ సామ్రాజ్యవాదులు యుద్ధరంగ సన్నాహాలకు బహి రంగంగానే పూనుకుంటున్నారు.

ప్రజారక్షణకోసం శాంతి రక్షణకోసం చేసే ప్రతిప్రయత్నాన్నీ అణచివేస్తున్నారు. ఎలుగెత్తే ప్రతి గొంతునూ నొక్కివేస్తున్నారు. వాళ్ళ సామ్రాజ్య విస్తరణకు అడ్డుతగులుతూఉన్న ప్రతి జాతినీ ప్రతి వ్యక్తినీ పీకనులుముతున్నారు తమఆత్మలను అమ్ముకోడానికి సిద్ధపడక పురోగామిప్రజాశక్తులతో భుజంభుజంకలిపి వారిబాధలనూ, గాధలనూ, ఆశలనూ, ఆశయాలనూ, ప్రతిబింబిస్తూ ప్రతిధ్వనిస్తూ ప్రజలతోపాటు ముందుకు సాగుతూన్న శాస్త్రవేత్తలనూ, ఉపాధ్యాయులనూ, రచ యితలనూ, కళావేత్తలనూ, అమెరికాలో హోవర్డ్‌ఫాస్టు, చార్లీచాప్లిన్, పాల్‌రాబ్సన్‌లాంటి వాళ్ళనూ, చిలీలో పాబ్లోనరూడా లాంటి వాళ్ళనూ తదితర పెట్టుబడిదారీ దేశాల్లో ఇంకా అనేకమందినీ ప్రతినిత్యం పోలీ సులు వెన్నాడుతున్నారు. బాధిస్తున్నారు. చెరసాలల్లో బంధిస్తు న్నారు. చివరకు హత్యలుకూడా చేస్తున్నారు.

మనదేశంలోకూడా మన కండ్లముందు అలాంటి ఘటనలే జరుగుతున్నా[illegible]భ్యుదయ మేధావులపై, ప్రజాసాంస్కృతికోద్య మాలపై [illegible]రంభిస్తున్నాయి. అతివాద భావాలనూ, అభ్యు

దయ భావాలనూ ప్రతిబింబించే డజన్లకొలది పత్రికలు వివిధ భాషల్లో నిషేధించబడ్డాయి. కమ్యూనిస్టుపార్టీకి చెందిన 'పీపుల్స్ ఏజ్' తదితర పత్రికలూ అన్ని రాష్ట్రాల్లో యీ నిషేధాలకు గురి అయ్యాయి. బహుజన సమాజవాదీ పార్టీ పత్రిక అయిన 'ఇన్‌కిలాబ్', ఫార్వర్డ్‌బ్లాకు పత్రిక 'ఆజాద్‌హింద్', అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ పత్రిక 'ది స్టూడెంట్', యువజనసంఘాలూ, కార్మికసంఘాలూ నడిపే ఇంకా అనేక పత్రికలపై ప్రభుత్వ నిషేధాస్త్రం ప్రయోగించబడింది. కళావేత్తలను అరెస్టుచేసీ, ఆఫీసులను మూసివేసీ, నాటకాలను, పాటలను నిషేధించీ అఖిలభారత ప్రజానాట్యమండలి, అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘంలాంటి అభ్యుదయ సంస్థలను కాళ్లూ చేతులు కట్టివేయడమయింది. ఆచరణలో వాటిని నిషేధించడమే జరిగింది.

ప్రజా ఉద్యమాలను చిత్రించే నాటకాలనూ పాటలనూ—ఉదాహరణకు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు రచించిన 'మాభూమి' కార్మికకవి అన్నభావ్‌సాఠే రచించిన 'లోకమంత్రి' వగైరాలను – నిషేధించడమో, లేక సెన్సార్‌చేయడమో జరిగింది. ఆధునిక కవులు రచించే సృజనాత్మక రచనలే కాకుండా షేక్‌స్పియర్ లాంటి ప్రాచీన మహాకవుల గ్రంథాలపైకూడా ఈ భస్మాసుర హస్తం పడింది. అంటే ప్రభుత్వ నిర్బంధం ఏదశలోఉందో ఊహించుకోవచ్చు. 'షిడ్రిఫెండ్స్ హార్‌కంట్రీ'లాంటి ఉత్తమ సోవియట్ చిత్రాలకు ఇదివరకు ఇచ్చిన లైసెన్సులుకూడా ఉపసంహరించుకోబడ్డాయి. కాని ప్రజల్లోదుర్నీతిని ప్రబోధించే అమెరికా చిత్రాలకు మాత్రం స్వేచ్ఛావిహారం లభించింది. సోవియట్‌ను గురించి విషప్రచారంచేసే 'ఐరన్ కర్టెన్' 'నినోచ్కా' లాంటి చిత్రాలు ప్రదర్శించరాదని ప్రజలు తమ అసమ్మతిని తెలియపరుస్తున్నా, వ్యతిరేక ప్రదర్శనాలు జరుపుతున్నా లెక్కచేయకుండా పోలీసు బలాన్ని ఉపయోగించి వాటిని ప్రదర్శిస్తూనే ఉన్నారు. సర్దార్ జాఫ్రీ, యశపాల్, గోపాల్ హల్దర్, అమర్‌షేక్, గులామ్ రబ్బానీ తబన్, రషీద్ జహాఁ, బలరాజ్ సాహ్నీ లాంటి అనేకమంది రచయితలనూ, కళాకారులనూ జైళ్ళల్లో బంధించారు. మఖ్దుమ్ లాంటి కవులు మరెందరికోసమో పోలీసులు ప్రతినిత్యం వేటాడుతున్నారు.

సంస్కృతిపై, విజ్ఞానంపై సాగించే యీదాడి కొందరు వ్యక్తుల తోనే- కొన్ని సంస్థలతోనే- ఆగలేదు. మన బిడ్డల- మన యువకుల- మొత్తం విద్యావిధానమే దెబ్బతినిపోయింది. ప్రజలందరిలోకి విద్యను తీసుకుపోవడానికి బదులు బడ్జెటులో విద్యాశాఖకయ్యే ఖర్చులను పూర్తిగా తగ్గించివేయడం జరిగింది. నోట్లముమ్మరాన్ని తగ్గించాలనే సాకుతో ఒకవైపు విద్యాశాఖకయ్యే వ్యయాన్ని తగ్గిస్తూ మరోవైపు పోలీసులకూ జైళ్ళకూ అయ్యేఖర్చునుమాత్రం విపరీతంగా పెంచివేశారు. ఉపాధ్యాయుల జీతాలు పోలీసుల జీతాలకంటె అధ్వాన్నమైపోయాయి.

తమ న్యాయమైన హక్కులకోసం నిజమైన స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామికంకోసం, సోషలిజంకోసం, పోరాడే కష్టజీవులైన మన ప్రజలందరిపైజరిగే సర్వవ్యాపిత దాడిలో ఒకభాగమే సాహితీ సంస్కృతులపై, విద్యావిజ్ఞానాలపై సాగించిన యీ దాడి.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఆనాడు ప్రవేశపెట్టిన నిర్బంధ చట్టాలకంటే ఇంకా ఎక్కువ దారుణరూపంలో శాంతిరక్షణ చట్టాలూ ప్రజారక్షణ చట్టాలూ అన్ని రాష్ట్రాల్లో అమలుజరుపబడ్డాయి. ఈ ఆర్డినెన్సులు ప్రజల ప్రాథమిక పౌరహక్కులన్నిటినీ హరించివేశాయి. పనికోసం, తగిన వేతనాలకోసం పోరాడే కార్మికులకూ, భూములకోసం పోరాడే రైతులకూ, జీవితావసరవస్తువుల ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా అసమ్మతిని తెలియపరచే మధ్యతరగతి ప్రజలకూ, అందరికి విద్యగావాలనీ, స్కూలుజీతాలు తగ్గించాలనీ డిమాండ్ చేసే విద్యార్థులకూ లాఠీలతో, తుపాకిగుండ్లతో సమాధానాలివ్వబడుతున్నాయి. వేలకొలది. కార్మికులూ కర్షకులూ విద్యార్థులూ మధ్యతరగతి ప్రజలూ వారి నాయకులూ ఎట్టివిచారణలేకుండానే ఇనుపకటకటాలమధ్య నలిగి కృశించి నశించిపోతూవున్నారు. వారు నిర్మించిన ప్రజాసంఘాలు క్రియారూపంలో నిషేధించబడ్డాయి. సమస్త మానవజాతి సంస్కృతికీ అభ్యుదయానికీ ప్రబలశత్రువులైన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల విషాదపూరిత పరిపాలనసమయంలో జరిగిన హత్యలూ మానభంగాలూ గృహదహనాలూ లూటీలూ వగైరా ఫాసిస్టుకిరాతకకృత్యాలన్నిటినీ నిన్నమొన్నటిదాకా వాటిని ఖండించిన పెద్దలే నేడు అంతకంటె దారుణంగా అమలుపరుస్తున్నారు.

బ్రిటీష్ కామన్‌వెల్త్‌తో ఇండియాను ముడిపెట్టి మన దేశానికి సర్వస్వతంత్ర ప్రతిపత్తి లేకుండా చేశారు. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆజ్ఞా ప్రకారం ఆగ్నేయ ఆసియా రక్షణ సంధికోసం జరిపే సమాలోచనలద్వారా మనపొరుగు మహా దేశమైన సోవియట్ యూనియన్‌కూ, ప్రజల ప్రజాస్వామిక దేశాలకూ నూతన ప్రజాతంత్ర చైనాకూ, ఆగ్నేయ ఆసియా విముక్తి ఉద్యమాలకూ వ్యతిరేకంగా అట్లాంటిక్ సంధినిపోలిన పసిఫిక్ సంధికోసం హిందూమహా సముద్రతీర దేశాల సంధికోసం కావలసిన సర్వసన్నాహాలూ చేయబడుతున్నాయి. విదేశ పెట్టుబడికి భారతప్రభుత్వం సంతోష పూర్వకంగా స్వాగతం యిస్తుందనీ భారత పెట్టుబడిదారులకిచ్చే సదుపాయాలూ, సౌకర్యాలూ విదేశీ పెట్టుబడి దారులకుకూడా ఇవ్వబడతాయని ఇటీవల నెహ్రూ ప్రకటించడం, అమెరికా గుత్త పెట్టుబడిదారులు విధించే షరతు లన్నిటికీ తలవంచి ప్రపంచబ్యాంకినుంచి అప్పు పుచ్చుకోడానికి అంగీకరించడం, బడ్జెటులో నూటికి 59 వంతులను దేశరక్షణకనే పేరుతో ప్రత్యేకించడం-ఇవన్నీ భారత దేశం డాలరు సామ్రాజ్యవాదులకు బానిసగానూ ఆంగ్లో-అమెరికన్‌లయుద్ధ వ్యూహానికి ఒక కీలకంగానూ తయారవుతూ ఉంది అనడానికి ప్రత్యక్ష నిదర్శనాలు.

ఈ పరిస్థితుల్లో ఇక శాంతికీ, అభ్యుదయానికీ శత్రువులెవరు అనే సందేహమే లేదు. సోవియట్ యూనియన్‌కూ, ప్రజల ప్రజాస్వామిక దేశాలకూ ప్రపంచ శ్రామిక ప్రజానీకానికీ వ్యతిరేకంగా యుద్ధానికి ప్లానులు వేసేవాళ్ళూ, గ్రీసు, స్పెయిన్, వీత్‌నాం, ఇండోనీషియా, బర్మా, మలయా దేశాల విముక్తి పోరాటాలను అణచివేయడానికి వలస యుద్ధాలు సాగించేవాళ్ళూ అయిన ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులూ, వాళ్ళ అడుగులకు మడుగులొత్తే పెట్టుబడిదారీ దేశాల బూర్జువా అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలూ ప్రపంచ శాంత్యభ్యుదయాలకు పరమ శత్రువులు.

'తటస్థత' 'స్వతంత్ర విదేశాంగనీతి' 'మూడోశక్తి' అని పదే పదే వాళ్ళువాడే మాటల అంతరార్థమేమిటి? ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు దాసోహం అనడం, సోవియట్ యూనియన్‌కూ,

ప్రపంచ ప్రజానీకానికి వ్యతిరేకంగా వాళ్ళు సాగించే యుద్ధంలో – మారణ వ్యాపారంలో – జీత బత్తెములు పుచ్చుకునే ఏజంట్లులాగా తయారుకావడం – ఇదే దాని అంతరార్థం. ఇదే దాని పర్యవసానం.

శాంతి ప్రజాతంత్రాలకోసం, సమస్తదేశాల స్వాతంత్రోద్యమాలకు ఆదర్శజ్యోతిగా వెలుగొందే సోవియట్‌తో సుహృద్భావం నెరవడంకోసం, యుద్ధోన్మాదుల ప్లానులను భగ్నంచేయడంకోసం, ప్రతిదేశంలోనూ కోటానుకోట్ల ప్రజలు కటిబద్ధులై కార్యరంగంలోకి వురుకుతున్నారు.

చైనా ప్రజాసైన్యం సాధించే మహత్తరవిజయాలూ, ఆగ్నేయ ఆసియాలో విజృంభిస్తూవున్న ప్రజావిముక్తి పోరాటాలూ, మార్షల్ ప్లానుకూ అట్లాంటిక్ సంధికీ వ్యతిరేకంగా ఫ్రాన్సు, ఇటలీ, తదితర యూరప్ దేశాల్లో లక్షలకొలది ప్రజలు పాల్గొన్న అసమ్మతి ప్రదర్శనాలూ, దినదినప్రవర్ధమానమవుతూవున్న సోవియట్ శక్తిసామర్థ్యాలూ, తూర్పుయూరప్ నూతన ప్రజాస్వామిక దేశాల బలసందలూ సామ్రాజ్యవాద యుద్ధోన్మాదశక్తులకంటె ప్రజాస్వామికశక్తులు ఎక్కువ బలవత్తరంగా వున్నాయనీ అవి అభ్యుదయనిరోధకశక్తుల నోడించగలవనీ ఎలుగెత్తి చాటుతున్నాయి.

ప్రపంచ ప్రజాశక్తులంపరితో భుజంభుంకలిపి మేధావులుకూడా శాంతి సంస్కృతుల సంరక్షణకై నడుములు బిగిస్తున్నారు. యుద్ధప్రేరేపక సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా శాంతి, ప్రజాతంత్ర, సోషలిస్టుశక్తులపక్షాన నిలబడి నిస్సంకోచంగా బాహాటంగా పోరాడడానికి సన్నద్ధులవుతున్నారు. శాంతి సంస్కృతుల సంరక్షణకై రోక్లాలో ఇటీవల జరిగిన ప్రపంచ మేధావుల మహాసభ, న్యూయార్కులో జరిగిన మహాసభ అభ్యుదయ మేధావులందరూ ప్రజలతరఫున నిలబడి పోరాడడానికి కృతనిశ్చయులై వున్నారని ప్రపంచానికి చాటి చెప్పాయి. ఆ మహాసభల్లో మేధావులు చూపిన దృఢనిశ్చయం యుద్ధప్రేరేపక సామ్రాజ్యవాదులకు ఒక సవాల్ లాంటిది. ప్యారిస్‌లో ఏప్రిల్ నెలలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభలో 59 దేశాల్లోని 60 కోట్ల మంది ప్రజల తరఫున హాజరైన ప్రతినిధులు ప్రపంచాన్ని

మరో మారణహోమంలోకి యీడుస్తూవున్న ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్లానులను భగ్నంచేసితీరుతాం అని ప్రతిజ్ఞచేశారు. మేధావులూ, రచయితలూ, కళాకారులూ, విజ్ఞానులూ సామ్రాజ్యవాద అభివృద్ధినిరోధకశక్తులకు వ్యతిరేకంగా ప్రజాస్వామికంకోసం, సోషలిజం కోసం, సాగించే పోరాటంలో తాముకూడా భాగస్వాములమే అని చాటి చెప్పారు.

ఈ ప్రపంచ వ్యాపిత మహోద్యమంలో ఒక భాగంగా భారతీయ మేధావులు తమ గొంతుకనుకూడా మేళవింప జేయాలి. సామ్రాజ్యవాద యుద్ధ శిబిరంలోకి భారత దేశాన్నికూడా ఈడ్చుకుపోయే ప్రయత్నాలన్నింటిని తుదివరకు ఎదిరించి పోరాడుతాం అని వారు నిష్కర్షగా చెప్పివేయాలి. శాంతి సంస్కృతుల సంరక్షణకై సమాలోచనలు జరిపేందుకు 1949 మే 31 జూన్ 1వ తేదీల్లో అభ్యుదయ శాంతి విజ్ఞానాలు ప్రజోపయోగకరంగా స్వేచ్ఛగా అభివృద్ధిచెందాలని వాంఛించేవారి నందరినీ-రచయితలనూ, కళాకారులనూ, విజ్ఞానులనూ, ఉపాధ్యాయులనూ, విద్యార్థులనూ - బొంబాయిలో సమావేశపరచాలని ఈ క్రింద సంతకాలు చేసిన మేము ప్రతిపాదిస్తున్నాం.

ప్రజాస్వామిక భావాలుగల స్త్రీపురుషులూ, సంస్కృతీపరులూ, ప్రజాస్వామిక సంఘాలూ ఈ మహాసభను బలపరచాలనీ, మహాసభ ఆశయాలను విరివిగా ప్రచారం చేయాలనీ, మహాసభలో పాల్గొనాలనీ శాంతి సంస్కృతుల సంరక్షణ అనే మహదాశయంకోసం ప్రజలను సమీకరించమనీ మేధావులందరికి విజ్ఞప్తి చేస్తున్నాం.

బొంబాయి అభ్యుదయ రచయితల సంఘం;
,, ప్రజానాట్యమండలి;
,, విద్యార్థి సంఘం;
,, సోవియట్ వి
,, ఉపాధ్యా

" మరో ప్రపంచ యుద్ధాన్ని – ప్రపంచ వ్యాపిత మారణహోమాన్ని – సాగించుటకు పారిశ్రామిక చక్రవర్తు లెందుకింత తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు? తమ అధికలాభాసక్తి ఫలితంగా, అరాచక పద్ధతులపై ఉత్పత్తిని కొనసాగించడంవల్ల ఏర్పడిన ఆర్థికమాంద్యం నుంచి బైటబడేందుకు మరో ప్రపంచ యుద్ధమేశరణ్యమని వాళ్ళు భావిస్తున్నారు."

"ఇదే భావాన్ని కావ్యభాషలో వ్యక్తీకరించాలంటే మరోసారి కార్మిక ప్రజల రక్తధారలను గ్రోలి మరణోన్ముఖమైన తమ వార్థక్యదశకు నూతన జీవం పోసి మరల నవ యౌవనం సాధించాలని వాళ్ళు కలలు గంటున్నారు."

– గోర్కీ

౧

# మార్క్సిస్టు సిద్ధాంతం: వర్గాలూ, వర్గపోరాటాలు

వర్గాలూ, వర్గపోరాటాన్ని గురించిన సిద్ధాంతాన్ని కారల్ మార్క్సు సూత్రీకరించాడు. ఆ సిద్ధాంతాన్ని గత వందసంవత్సరాల సోషలిస్టు ఉద్యమ దీర్ఘానుభవం ధృవపరచింది. పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసి సోషలిజాన్ని స్థాపించడానికి జరిపే పోరాటంలో అన్ని దేశాలలోని కమ్యూనిస్టులకూ యీ సిద్ధాంతమే నమ్మకమైన ఆయుధమైంది. వర్గాలూ, వర్గపోరాటాన్ని గురించిన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ననుసరించే బోల్షివిక్ పార్టీ పెట్టుబడిదారీ విధానాన్ని తుదముట్టించి సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని నిర్మించగలిగింది. ఈ సిద్ధాంత పతాకం క్రిందనే అన్ని దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు పోరాటాలను నడుపుతూ విజయాలను సాధిస్తున్నాయి.

మార్క్సిస్టు మూలసూత్రమైన వర్గపోరాటసిద్ధాంతాన్నుండి ఏ కొంచెమైన పెడదారి పట్టినా (డీవియేషన్) అది సోషలిస్టు ఉద్యమాన్ని బూర్జువాపంథావైపు దిగజార్చివేస్తుంది. ఇప్పటివరకూగల కార్మికవర్గ చరిత్రాత్మక అనుభవమంతా యీ సత్యాన్నే బోధించుతోంది. మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతాన్ని అవతలకునెట్టి దాని స్థానే పీడక వర్గాలకూ, పీడితవర్గాలకు మధ్యవర్గసామరస్యాన్ని బోధించే సిద్ధాంతాన్ని చేబట్టిన సోషల్ డెమోక్రట్ సంస్కరణవాదం ఎంత క్రిందికి దిగజారిపోయి, బూర్జువా వర్గానికి సలాంకొట్టవలసి వచ్చిందో అందరికీ స్పష్టంగా తెలిసిన విషయమే. సోషలిస్టు సంస్కరణ

పి. ఫెడోసెయేవ్
సో. యూ. కమ్యూనిస్టుపార్టీ
సిద్ధాంత పత్రిక
"బోల్షివిక్"
ప్రధాన సంపాదకుడు.

వాదాన్ని చేబట్టిన యీనాటి మితవాద సోషలిస్టులు అమెరికా సామ్రాజ్యవాదానికి బహిరంగంగానే బంటులయ్యారు.

సామాన్య బూర్జువావర్గం తన ఏజంట్లద్వారా కమ్యూనిస్టు ఉద్యమఅనుయాయులలో ఏదో విధంగా చీలికలు తెచ్చి మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతంయెడల అపనమ్మకాన్ని కలిగించి, మార్క్సిస్టు - లెనినిస్టు వర్గ పోరాట సిద్ధాంతంయొక్క పదునును తగ్గించి, ఆ విధంగా కమ్యూనిస్టులను సంస్కరణవాద పంథావైపుకు మొగ్గించడానికి అన్నివిధాల తంటాలుపడుతున్నది. సామ్రాజ్యవాదానికి అమ్ముడుపోయిన బుఖారిన్ లాంటిద్రోహులు మార్క్సిస్టు వర్గ పోరాటసిద్ధాంతాన్ని వ్యతిరేకించిపెట్టుబడిదారీ విధానాన్నుండిసోషలిజానికి శాంతియుతంగా పరిణితి చెందవచ్చుననే లొంగుబాటు సిద్ధాంతాన్నిప్రచారం చేసిన విషయం అందిరికి తెలిసినదే.

మార్క్సిస్టు వర్గ పోరాట సిద్ధాంతాన్నుండి పెడత్రోవబట్టడం ఎంతటి వినాశకరమో అంతర్జాతీయ తత్వాన్నుండి విడివడి ఛోటా బూర్జువా జాతీయతను స్వీకరించిన యుగోస్లావియా నాయకత్వ రాజకీయ దివాళాకోరుతనమే స్పష్టంగా తెలియజేసింది. యుగోస్లావియా నాయకులు సామ్రాజ్యవాద వ్యతిరేక సోషలిస్టు సంయుక్త సంఘటన నుండి విడిపోయి, కార్మికవర్గ అంతర్జాతీయ సంఘటనకు ద్రోహం చేశారు. ఈ విధంగా వారు యుగోస్లావియాను సామ్రాజ్యవాద రాజ్యాల బానిసత్వానికి బలిఅయ్యే ప్రమాదానికి గురిచేశారు.

మార్క్సిస్టు వర్గ పోరాట సిద్ధాంతాన్ని త్యజించడం అంటే అది రాజీలకూ, బూర్జువావర్గం ముందులొంగుబాటు తనానికి తప్పని సరిగా దారితీస్తుంది. అందుకనే అన్ని దేశాలలోని సామ్రాజ్యవాదులూ, యీ పదునైన మహత్తర ఆయుధాన్ని కార్మిక వర్గానికి లేకుండా చేసేందుకు మార్క్సిస్టు వర్గ పోరాట సిద్ధాంతాన్ని అతితీవ్రంగా ఎదుర్కొంటారు.

మార్క్సుకు ముందున్న బూర్జువా ఆర్థికశాస్త్రవేత్తలూ, చరిత్రకారులూ సమాజంలో వర్గాలూ, వర్గపోరాటం వుండటాన్ని గుర్తించారు. కాని వారు యీవిధంగా సమాజం వర్గాలుగా విభజించివుండటాన్ని శాశ్వతమైనదిగానూ, నిర్వికల్పమైన సామాజిక సూత్రంగానూ పరిగణించారు. అందుమూలంగా వారు వర్గవైరుధ్యాలను సమాధానపరచడానికి సిద్ధపడ్డారు. ధనిక, పేద తారతమ్యాలు వుండటం వారి దృష్టిలో సహజమైన శాశ్వతమైన సామాజిక పరిస్థితి.

వివిధ వర్గాలు వుండటం శాశ్వతమైన సహజవిషయం కాదని మార్క్సు చూపెట్టాడు. చారిత్రాత్మకంగా ఏర్పడిన ఉత్పత్తి అభివృద్ధిపద్ధతులనూ, వ్యక్తిగత ప్రయివేటు ఆస్తికీ సంబంధించిన ఉత్పత్తివిధాన సంబంధాలనూ అనుసరించి యీవర్గాలు ఏర్పడ్డాయనికూడా మార్క్సు తెలియజెప్పాడు. అంతేకాదు; మార్క్సువర్గాలు లేకుండా చేసే మార్గాన్ని కనుగొని, సమాజాన్ని వర్గవైరుధ్యాలనుండి విముక్తిచేసే సాంఘికశక్తిని మనకు చూపెట్టాడు.

పెట్టుబడిదారీ విధానాన్ని భూస్థాపితం చేసి, సోషలిస్టు సమాజ నిర్మాతగా కార్మికవర్గానికున్న ప్రపంచ చారిత్రాత్మకపాత్రను మార్క్సు కనుగొన్నాడు. ఇదే

మార్క్సు మానవ ప్రపంచానికి చేసిన మహత్తరసేవ. శ్రామిక, పీడిత ప్రజలందరిలో కెల్లా కార్మికవర్గాన్నే చివరవరకూ ఖచ్చితంగా పోరాడే విప్లవశక్తిగా మార్క్సిజం గుర్తిస్తుంది. కార్మికవర్గం యితర శ్రామిక ప్రజలవలె ఎలాంటి వ్యక్తిగత ప్రయివేటు ఆస్థికి కట్టుబడి ఉండదు. ఈ వర్గం పెట్టుబడిదారీ విధానం అభివృద్ధితోపాటు తానూ వృద్ధి చెందుతుంది. అందుకనే ఇది పెట్టుబడిదారీ విధానాన్ని నాశనం చేయగలిగే శక్తిని కలిగివుండి, శ్రామిక జనసామాన్యాన్ని సోషలిజానికి తీసుకొని వెళుతుంది.

(శ్రా)మికవర్గం కొనసాగించే వర్గపోరాటం తప్పనిసరిగా బూర్జువా రాజకీయ ఆధిక్యతను తుదముట్టించి, శ్రామికవర్గ నియంతృత్వ స్థాపనకు దారి తీస్తుందని మార్క్సుచూపెట్టాడు. వర్గాలను నాశనం చేయడానికీ, ఒకమనిషిని మరొకమనిషి దోపిడీ చేసేవర్గ విభేదాలకు తావునిచ్చే పరిస్థితులకు స్వస్తి చెప్పడానికీ శ్రామికవర్గ నియంతృత్వం తప్పనిసరియైన ఆయుధమనికూడా మార్క్సు స్పష్టపరచాడు.

పెట్టుబడిదారీ విధానాన్ని తుదముట్టించి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించే పోరాటంలో కార్మికవర్గానికి గల ప్రధాన పాత్ర మామూలు ధోరణిలో గాక కార్మిక వర్గ విప్లవపార్టీ నాయకత్వాన నిర్వహించబడుతుందని మార్క్సిజం - లెనినిజం బోధించుతోంది. శ్రామికవర్గం నిర్వహించే వర్గ పోరాటానికి కమ్యూనిస్టులు నాయకత్వం వహించి జయప్రదంగా నడుపగలుగుతారు. ఎందువల్లనంటే కార్మికవర్గంలో కెల్లా అత్యంత నిర్మాణయుక్తమైన అగ్రగామిగా కమ్యూనిస్టులు పరిస్థితులనూ, పంథానూ, శ్రామికవర్గ ఉద్యమసాధారణ ఫలితాలనూ శాస్త్రీయదృక్పథంతో అర్థం చేసుకో గలిగివుంటారు.

మార్క్సిస్టుపార్టీ ఒక్కటే జనసామాన్యం శ్రామికవర్గ ప్రయోజనాలను గుర్తించేటట్లు చేయగలుగుతుంది. ఆ ఒక్కపార్టీయే కార్మికవర్గాన్ని ట్రేడ్‌యూనియన్ ఆర్థిక తత్వాన్నుండి మరల్చి, స్వతంత్ర రాజకీయశక్తిగా మార్చగలశక్తిని కలిగివుంటుంది. కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లుగా కార్మికవర్గానికి రాజకీయంగా నాయకత్వం వహించేది పార్టీయే:

"యుద్ధం చేస్తున్న ఏ సైన్యమూ - తాను అపజయాన్ని పొందకుండా వుండాలంటే మంచి అనుభవంకలిగిన సైన్యాధిపతుల కమిటీని త్రోసివేయలేదు. అటువంటి పరిస్థితులలో శ్రామికవర్గం తన శత్రుమూకల ప్రమాదానికి గురికాకుండా వుండాలంటే నాయకత్వం వహించే యుద్ధకమిటీని అసలే త్రోసిపుచ్చలేదని తేటతెల్లం కావడంలేదా? అయితే నాయకత్వం వహించగలిగిన యీ యుద్ధకమిటి ఎక్కడుంది? శ్రామికవర్గ విప్లవపార్టీ ఒక్కటే ఆ విధనమైన యుద్ధకమిటీ బాధ్యతను నిర్వహించగలుగుతుంది. విప్లవపార్టీ లేని కార్మికవర్గం యుద్ధకమిటీలేని సైన్యంతో సమానం. పార్టీయే కార్మికవర్గంయొక్క యుద్ధ కమిటీ."

— స్టాలిన్
(ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం)

విప్లవపార్టీని కలిగి వుండటం మూలంగా శ్రామికవర్గం పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా నిర్మాణయుక్తమైన పోరాటాన్ని సాగించి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించగలుగుతుంది. కోటానుకోట్ల శ్రామికప్రజాసామాన్యానికి పార్టీ నాయకత్వాన్ని వహించి, శ్రామికుల వర్గపోరాటాన్ని సరియైన వ్యూహంతోనూ, ఎత్తుగడలతోను నడుపుతుంది. పార్టీనాయకత్వంవుండటం మూలంగా కార్మికవర్గం వర్గశక్తుల బలాబలాలను, కలయికను సరిగా అంచనావేసి పోరాటాలనుండి అనుభవాన్ని గ్రహించి పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా పోరాటాన్ని కొనసాగించగలుగుతుంది. అంతేకాదు; మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతమనే మహాయుధం గలిగిన పార్టీనాయకత్వాన్ని తాను కలిగివుండటం మూలంగా శ్రామికవర్గం పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా తానుసాగించే పోరాటంలో తన మిత్రులను ఏరుకొనగలిగి, వారితో కూడిన పోరాట పంథా ఎలావుండాలో సరిగా నిర్ణయించుకోగలుగుతుంది.

పెట్టుబడిదారీ విధానాన్ని జయప్రదంగా ఎదుర్కొనేందుకు సరియైన సిద్ధాంతాన్ని, సరియైన పాలసీని తనకు ప్రసాదించినందుకు కమ్యూనిస్టు ఉద్యమం మహానాయకులైన మార్క్సు, ఎంగిల్సు, లెనిన్, స్టాలిన్‌లకు ఎంతో రుణపడివుంది. కమ్యూనిజానికి మూలపురుషులూ, నాయకులూ అయినా వీరు కార్మికవర్గానికి వర్గపోరాట సూత్రాల, సోషలిస్టు సమాజనిర్మాణసూత్రాల జ్ఞానాన్ని ప్రసాదించారు. అంతే కాక కమ్యూనిజం కోసం జయప్రదంగా జరిగే పోరాటంలో శ్రామికవర్గానికి శక్తివంతమైన ఆయుధంగా వుండే కమ్యూనిస్టుపార్టీకున్న ప్రముఖపాత్రను కూడ విస్పష్టం చేశారు.

బూర్జువావర్గ ప్రయోజనాలకు అనుగుణ్యంగా లొంగిపోయి, సోషల్ డెమోక్రట్ల సంస్కరణవాదనాయకులు తమ విద్రోహచర్యలద్వారా సోషలిస్టు ఉద్యమానికి ఎంతో హాని కలిగించారు. ఈసంస్కరణవాదానికి దాని దివాళాకోరు నాయకులకూ వ్యతిరేకంగా పోరాడి కమ్యూనిస్టు ఉద్యమం అభివృద్ధిచెంది, ఎంతోబలపడింది.

మార్క్సు, ఎంగిల్సుల విప్లవ బోధలననుసరించి లెనిన్, స్టాలిన్‌లు ఒక కొత్తరకపు పార్టీని - బోల్షివిక్‌ల పార్టీని సృష్టించి; కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఒక నూతన ఉన్నత దశకు తీసుకొనిపోయారు. దాని ఫలితంగానే ప్రపంచంలోని అత్యంత శక్తివంతమైన దేశాలలోని ఒకదానిలో సోషలిజం విజయం పొందింది. దాని ఫలితంగానే ఇతర దేశాలన్నింటిలో సోషలిస్టుశక్తులు అత్యంత ఉధృతంగా అభివృద్ధిచెందాయి.

మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతం శ్రామికవర్గ నాయకత్వం అనే దృక్పథాన్ని ఆధారం చేసుకొని ఏర్పడింది. విముక్తి ఉద్యమంలో శ్రామికవర్గ నాయకత్వాన్ని ఆధారం చేసుకొనే యీ సిద్ధాంతంకోసం మార్క్సు ఎంగిల్సు పోరాడుతూ, కష్టపడి పనిచేసే జనసామాన్యంలోని శ్రామికవర్గేతర ప్రజలను, ముఖ్యంగా రైతాంగ పాత్రను కొంచెపరచే దృక్పథానికి ప్రతికూలంగా ఎడతెగని పోరాటాన్ని సాగించారు. దీనితో పాటు వర్గపోరాటాన్ని వెనక్కినెట్టి, సమాజంలోని వర్గాల స్థానంలో "ప్రజలు" అనే దృక్పథాన్ని చొప్పించే సోషల్ డెమాక్రట్ల ఛోటాబూర్జువా అవకాశవాదధోరణికి వ్యతిరేకంగా కూడా మార్క్సు, ఎంగిల్సులు ఎడతెగని పోరాటాన్ని కొనసాగించారు.

కార్మికవర్గంతో పోల్చిచూసినప్పుడు తతిమ్మా వర్గాలన్నీ అభివృద్ధి నిరోధక ప్రజ అని చెప్పే "లస్సాల్లిన్" సిద్ధాంతాన్ని 1875 లో తమ (గోథా) కార్యక్రమంలో చేర్పించినందుకు జర్మన్ సోషల్ డెమోక్రట్లను మార్క్స్, ఎంగిల్సులు తీవ్రంగా ఖండించారు. ఈ 'లస్సాల్లిన్' సిద్ధాంతం కమ్యూనిస్టుపార్టీ ప్రణాళికను (మానిఫెస్టో) వికృతంగా పెడర్ధం తీసిన ఫలితం మాత్రమేనని మార్క్స్, ఎంగిల్సు చూపెట్టారు.

బూర్జువా వర్గానికి వ్యతిరేకమైన వర్గాలన్నింటిలోకెల్లా శ్రామికవర్గమొక్కటే ఆఖరివరకూ ఖచ్చితంగా నిలబడే విప్లవవర్గమని మార్క్స్ ఎంగిల్సులు చెప్పారు. ఇక మధ్యలోవుండే వర్గాలు (రైతులు, ఇతర వృత్తి పనివారు, చేతిపనివారు) శ్రామికవర్గ దృక్పథాన్ని అంగీకరించేందుకు తమ స్వంత దృక్పథం ఎంతవరకు వదులుకుంటారో అంత మేరకు విప్లవస్వభావాన్ని కలిగివుంటారు. కాని యింతమాత్రంచేత కార్మికవర్గానికి యీ మధ్య వర్గాలలో మిత్రులు వుండరని భావించరాదు. పైగా పై సూత్రం ప్రకారం కార్మికవర్గానికి యీమధ్యవర్గాలలో మిత్రులుండగలరనే విషయానికే ఆస్కారంవుంది.

భూస్వామిక, పెట్టుబడిదారీ పీడనకూ, దోపిడికీ వ్యతిరేకంగా కార్మికవర్గం సలిపే పోరాటంలో తనకుసహజ మిత్రులనుండీ, కావడానికి అవకాశమున్నా మిత్రుల నుండీ కార్మికవర్గాన్ని వేరుపరచే సిద్ధాంతాన్ని లేవదీసిన 'లస్సాల్లీన్ల' విప్లవ వ్యతిరేక ప్రయత్నాలకు మార్క్స్ ఎంగిల్సులు ఎలాంటి దయాదాక్షిణ్యం లేకుండా దెబ్బకొట్టారు. వ్యవసాయ దేశాలన్నింటిలో శ్రామిక వర్గానికి పేదరైతుల అండవుంటేనే శ్రామిక విప్లవాన్ని జయప్రదంగా సాగించడానికి సాధ్యమవుతుందనీ మార్క్స్ స్పష్టంగా తెలియజేశాడు.

వర్గదృష్టితో పరిశీలించే ప్రయత్నం చేయకుండా "ప్రజలు" అన్న పదాన్ని తమ ప్రయోజనాలకు వీలయినన్ని విధాల ఉపయోగించే సోషల్ డెమోక్రట్ అవకాశవాదులనుకూడా మార్క్స్ ఎంగిల్సులు తీవ్రంగా విమర్శించారు. ఈ అవకాశవాదులు "ప్రజల"ను ఏదోఒక సముదాయమని తమ ఛోటాబూర్జువాతత్వంతో అర్ధరహితంగా వాగుతారు. రాజ్యాంగ యంత్రాన్ని వర్గసంస్థలకు అతీతమైన వస్తువుగా పరిగణిస్తారు. ఈ విధంగా వారు పైనఉదహరించిన ముసుగులు వేసుకొని ప్రజాస్వామికంకోసం సోషలిజంకోసం జరిగే పోరాటంలో కార్మికవర్గానికున్న నాయకత్వ పాత్రను నిరాకరిస్తారు.

రాజ్యాంగయంత్రం వర్గాలకు అతీతమైవుండి, వర్గవైరుధ్యాలను సమన్వయపరచే "యావత్తు ప్రజలకు" చెందిన సంస్థగావుండగలదని చెప్పే సోషల్ డెమోక్రట్ అవకాశవాదుల వాదనలను మార్క్స్, ఎంగిల్సులు తీవ్రంగా ఖండించారు. శ్రామికవర్గం విప్లవంద్వారా రాజ్యాధికారాన్ని స్వాధీనంచేసుకొన్న పక్షంలో అది తన అధికారం ద్వారా వర్గాలను అలాగే సమన్వయపరచడానికి బదులు వర్గవైరుధ్యాల అసలు అస్థిత్వానికే స్వస్తిచెప్పి, వర్గాలను మొత్తంమీద తుదముట్టించడానికి ప్రయత్నించుతుంది. మార్క్సిజం మూలపురుషులైన మార్క్స్ - ఎంగిల్సుల భావనయిదే. లెనిన్, స్టాలిన్లు అవకాశవాదులకు వ్యతిరేకంగా మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతాన్ని కాపాడటమేగాక యింకా దానిని అభివృద్ధిపరచారు. శ్రామిక జనసామాన్యంలోని

శ్రామికవర్గేతర ప్రజలయెడల శ్రామికవర్గాని కుండవలసిన వైఖరినిగురించి మార్క్సు, ఎంగిల్సులు వెలిబుచ్చిన భావాలను దిట్టపరచారు.

సమాజం వర్గాలుగా విభజించబడటాన్ని మరుగుపరచి, పెట్టుబడిదారీవిధానపు అభివృద్ధితోపాటు వర్గపోరాటం తీవ్రతరమవడాన్ని నిరాకరించి, అంతరంగిక వర్గ వైషమ్యాలులేని ఒక ఐక్యసముదాయంగా(యూనిట్‌గా) ప్రజలను పరిగణించే "నరోడ్నిక్" సిద్ధాంతాన్ని లెనిన్, స్టాలిన్‌లు తీవ్రంగా ఎదుర్కొన్నారు. రైతాంగంలోని వర్గ తారతమ్యాలకు ప్రాముఖ్యతనివ్వడం నిరాకరించి, అందులోఒకభాగం కులక్‌లుగా అభివృద్ధి చెందేవిషయాన్నికూడా కొంచెపరుస్తూ "నరోడ్నిక్‌లు" కులక్‌ల (ధనిక రైతుల) ప్రయోజనాలకోసం పాటుబడ్డారు. బూర్జువావర్గ ప్రయోజనాలకోసం 'నరోడ్నిక్'లూ, వారి కడసారిబిడ్డఅయిన సోషలిస్టు - రివల్యూషనరీలూ వర్గవైరుధ్యాలను మరుగుపరచి, జనసామాన్యాన్ని వర్గపోరాటాన్నుండి దూరంచేసి, పీడితులకూ, పీడకులమధ్య సామరస్యాన్ని బోధించే సిద్ధాంతాన్ని వారిలో నాటడానికి ప్రయత్నించారు.

విముక్తిపోరాటంలో శ్రామికవర్గానికున్న నాయకత్వ పాత్రను నిరాకరించిన 'నరోడ్నిక్'ల, సోషల్ డెమోక్రట్ సంస్కరణవాదుల వైఖరికి ప్రత్యక్షవిరుద్ధంగా లెనిన్, స్టాలిన్‌లు పెట్టుబడిదారీ బానిసత్వాన్నుండి మానవజాతిని విముక్తిచేసే మొన గాడుగా శ్రామికవర్గ ప్రపంచ చరిత్రాత్మక పాత్రనుగురించి నొక్కి మరీచెప్పారు.

"'ప్రజల మిత్రులు' ఎవరు? వారు సోషల్ డెమోక్రట్లను ఏవిధంగా ఎదుర్కొంటారు?" అనే తన ప్రఖ్యాత గ్రంథంలో లెనిన్ యిలాచెప్పాడు:

"సోషల్ డెమోక్రట్లుసహితం తమదృష్టిని, తమ యావత్తు కార్యకలాపాలనూ కార్మికవర్గంలోనే కేంద్రీకరించుతారు."

శ్రామికవర్గానికున్న ప్రపంచ చారిత్రాత్మకపాత్రను గురించి నొక్కిచెప్పుతూ 1901 లోనే కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు:

"......రష్యాలోనూ సాధారణంగా ప్రతిదేశంలోనూ విప్లవ శ్రామిక వర్గమొక్కటే మానవజాతిని విముక్తిచేసి, ప్రపంచానికి సర్వసౌఖ్యాలను కలుగ జేయగలదని చరిత్ర చాటిచెపుతోంది."

— కలెక్టడ్ వర్క్సు, సంపుటి 1, పేజీ 8

శ్రామిక జనసామాన్య మంతటిలోను శ్రామికవర్గాన్ని కలిపివేసి, ఖచ్చితంగా నిలబడే విప్లవవర్గంగా దాని నాయకత్వపాత్రను కొంచెపరచడానికి మెన్షివిక్‌లు చేసిన ప్రయత్నాలన్నింటినీ బోల్షివిక్‌పార్టీ స్థాపకులు బట్టబయలుచేసి, నాశనం చేశారు. కార్మికవర్గ నాయకత్వపాత్రను గురించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని లెనిన్, స్టాలిన్‌లు బలపరచడమేగాక, కార్మికవర్గం తన నాయకత్వపాత్రను సక్రమంగా నిర్వహించేందుకు అది ఒక స్వతంత్ర రాజకీయపార్టీగా నిర్మాణం కావాలని, ఆ సిద్ధాంతాన్ని వారు ఇంకా అభివృద్ధి చేశారు

1902 లో పార్టీ చిత్తు కార్యక్రమాన్ని తయారుచేసే సమయంలోనే సమాజాన్ని విప్లవ పునర్నిర్మాణానికి శ్రామికవర్గపాత్ర, దాని పార్టీని గురించిన సమస్యపై లెనిన్‌కూ ప్లెఖనోవ్, జాసులిచ్ వారి అనుయాయులకూ మధ్య తీవ్రమైన విభేదాలు పొడసూపాయి.

తాను తయారుచేసిన చిత్తు కార్యక్రమ తీర్మానంలో చిన్న ఉత్పత్తిదారులకూ శ్రామికవర్గానికీవున్న సంబంధాన్ని గురించి పూర్తిగా తప్పుదారిని వెళ్ళాడు. ప్లెఖనోవ్ చిత్తు తీర్మానంలో కార్మికవర్గానికీ మామూలు శ్రామిక జనసామాన్యానికీ, పీడితప్రజలకు ఎలాంటి భేదాన్ని గుర్తించలేదు. అతని చిత్తు తీర్మానంలో శ్రామిక, పీడిత జనసామాన్యాలలో నానాటికి పెరుగుతున్న అసంతృప్తిని గురించి జనరల్ స్టేటుమెంటులు మాత్రమే వున్నాయి. ప్లెఖనోవ్ ప్రతిపాదించిన యీ తప్పు సిద్ధాంతాన్ని విమర్శించుతూ లెలిన్ యిలా వ్రాశాడు:

"శ్రామిక పీడిత ప్రజాసామాన్యంలో అసంతృప్తి పెరుగుతున్నది. ఇది నిజమే. కాని ఇక్కడ (ప్లెఖనోవ్ తయారుచేసిన చిత్తుతీర్మానంలో) చేసినట్లుగా శ్రామికవర్గ అసంతృప్తినీ చిన్న ఉత్పత్తిదారుని అసంతృప్తినీ కలిపివేసి ఒకటిగానే పరిగణించడం పూర్తిగా పొరపాటు. చిన్న ఉత్పత్తిదారునిలో వున్న అసంతృప్తి కొద్దిపాటి ఆస్థి యజమానిగా తన అస్థిత్వాన్ని సామాన్యంగా రక్షించుకోవాలనే కోరిక (తప్పనిసరిగా అతనిలోనూ, యీ వర్గంలోని తగినంత భాగంలోనూ తప్పకుండా యీ విధమైన వైఖరి తీసుకోనడం జరుగుతుంది.) రేకెత్తించుతుంది. దీని అర్థం: ప్రస్తుతం వున్న వ్యవస్థ పునాదిని రక్షించడానికి తయారుకావడమన్న మాట. యింకా దీనిని వెనక్కు తీసుకొని వెళ్ళడానికి కూడా ప్రయత్నం జరుగవచ్చు."

—కలెక్టడ్ వర్కు్సు, సంపుటి 6 పేజీలు 32,33

మార్కిస్టుపార్టీ కార్మికవర్గ పార్టీ మాత్రమేకాదనీ, అది కార్మికులకూ, ఇతర కొద్దిపాటి వ్యక్తిగత ఆస్తులు ఉన్నవారిదికూడా అవుతుందని ప్లెఖనోవ్ చేసిన వాదన సమర్థనీయం కాదనికూడా లెనిన్ రుజువుచేశాడు. ప్లెఖనోవ్ ఆ విధంగా వాదన చేయడాన్నిబట్టి అతడు విప్లవ పోరాటంలో శ్రామికవర్గ నాయకత్వ పాత్రను అర్థం చేసుకొన్నట్లులేదు. అంతేకాదు. కార్మికవర్గ అగ్రగామిగా, శ్రామికవర్గ అత్యున్నత వర్గ సంస్థగా మార్కిస్టుపార్టీ పాత్రను అర్థం చేసుకోలేకపోయాడు.

పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయడానికీ రాజకీయాధికారాన్ని స్వాధీనం చేసుకోడానికీ ఆ తరువాత దానిని సంఘటిత పరచుకొనడానికీ మార్కిస్టుపార్టీ శ్రామికవర్గం చేతిలో ఒక పటిష్టమైన ప్రధాన ఆయుధమనే విషయాన్ని ప్లెఖనోవ్ అతని అనుయాయులూ అర్థంచేసుకోలేక పోయారు. మార్కిస్టుపార్టీ వర్గ స్వభావాన్ని మరుగుపరచడమంటే శ్రామికవర్గానికీ యితర శ్రామికపీడిత ప్రజాసామాన్యానికి వున్న సంబంధాన్ని గురించినమార్కిస్టు సిద్ధాంతానికి పూర్తిగా అపార్థంతీయడమే అవుతుంది.

ఆ తరువాత మెన్షివిక్ లిక్విడేటర్లు స్వతంత్ర కార్మికవ[illegible] [illegible]వుండవలసిన అవసరమేలేదని చెప్పుతూ పార్టీని "నాన్-పార్టీ కార్మికుల [illegible] లేక శ్రామిక

జనసామాన్యానికి చెందిన నాన్–పార్టీ సంస్థగాగాని మార్చాలని ప్రతిపాదించిన సంగతి అందరికీ తెలిసిన విషయమే.

పార్టీ కార్యక్రమాన్ని తయారుచేస్తూ లెనిన్ జసులిచ్ ప్రతిపాదనలను విమర్శించాడు. జసులిచ్ ప్రతిపాదనలు ఆచరణలో శ్రామిక వర్గపోరాటదృక్పథానికి బదులుగా మొత్తం శ్రామిక, పీడిత జనసామాన్యపు పోరాటదృక్పథాన్ని ప్రవేశపెట్టిందని స్పష్టపరచాడు. చిన్నచిన్న ఉత్పత్తి దారులు శ్రామికవర్గంతో వేయివిధాల సంబంధాలను కలిగిఉన్నప్పటికీ వారు ఒక ప్రత్యేకవర్గంక్రిందకు వస్తారని లెనిన్ తెలియజేశాడు. అంతేకాక వారు యిటు శ్రామికవర్గానికి అటు బూర్జువావర్గానికీ మధ్య ఊగిసలాడే ఒక ప్రత్యేకవర్గం.

మార్క్సిస్టుపార్టీ శ్రామికవర్గపంధాను అనుసరించుతూ, శ్రామిక ప్రజానీకంలోని స్థిరత్వంలేని శ్రామికవర్గేతర ప్రజల వూగిసలాటను అధిగమించ గలిగితేనే విప్లవాత్మక ప్రజలకు నాయకుడు కాగలుగుతుంది. ఆ ప్రాతిపతికపై పనిచేస్తేనే ఛోటాబూర్జువా శక్తులు తమ దృక్పథాన్ని విడిచిపెట్టి పోరాటకాలంలో శ్రామిక వర్గదృక్పథాన్ని అంగీకరించేటట్లు కార్మికవర్గపార్టీ చేయగలుగుతుంది.

శ్రామిక ప్రజానీకం ఒక్క కార్మికవర్గ నాయకత్వంక్రిందనే తమ స్వాతంత్ర్యాన్ని సాధించుకొని తమ పరిస్థితులను అభివృద్ధిచేసుకోగలదని లెనిన్ వివరించి చెప్పాడు. శ్రామికవర్గేతరజనసామాన్యం యెడల మార్క్సిస్టుపార్టీ కర్తవ్యమేమంటే పెట్టుబడిదారీసమాజంలో వారి నిస్సహాయతను వివరించి పెట్టుబడిదారీ విధానపు దోపిడి నుండి వారు విముక్తి చెందాలంటే సాంఘిక విప్లవం ఒక్కటే శరణ్యమని వారికి నచ్చజెప్పాలి.

“ప్రజలు” “విప్లవప్రజాస్వామికం” అనే పదాలంటేనే మూతివిరచే మెన్షివిక్లకూ, ట్రాట్స్కీ అనుయాయులకూ వ్యతిరేకంగా లెనిన్, స్టాలిన్‌లు తీవ్రమైన పోరాటాన్ని సాగించారు. మార్క్సిజం “ప్రజలను” “వర్గాలు”గా విభజించుతుందని లెనిన్ వివరించిచెప్పాడు. ఇది పురోగామివర్గం. ఇతరులనుండి మడిగట్టుకోవడానికి గాక దానికి గల ప్రత్యేకస్వభావం తెలిసుకొని వున్నది కాబట్టి. అదేమంటే:

> “దానికి మధ్యలో ఆగిపోయే స్వభావమంటూ లేదు; మధ్యవర్గాలకున్న స్థిరత్వంలేమి, కృతనిశ్చయం లేకపోవడం మొదలుగాగల దుర్గుణాలులేవు. అది యావత్తు ప్రజలకు నాయకత్వం వహించి, అఖిలప్రజానీకం శ్రేయస్సు కోసం ఎంతోశక్తివంతంగానూ, ఎంతో ఉత్సాహంతోనూ పోరాడగలుతుంది.”

— లెనిన్.

కలెక్టెడ్ వర్క్సు, సంపుటి 9, పేజీ 92.

రైతాంగంలోని అత్యధికసంఖ్యాకులలో గల విప్లవలక్షణాలను తెలియజెప్పి, వాటిని ప్రజాస్వామికం కోసం, సోషలిజంకోసం కార్మికవర్గం కొనసాగించే పోరాటంలో వినియోగించు[illegible]క ఆవశ్యకతను లెనిన్, స్టాలిన్‌లు విస్పష్టం చేశారు. పెట్టుబడిదారీ విధా[illegible]ను పీల్చిపిప్పిచేసి నాశనంచేస్తుంది. అతన్ని దరిద్రానికీ,

అవిద్యాకూ, అజ్ఞానానికి గురిచేస్తుంది. అతనికి ఎలాంటిహక్కులూ లేని నిరాయుధుని చేస్తుంది. పెట్టుబడిదారులూ, పెద్ద పెద్దభూస్వాములూ, వర్తకులూ కొనసాగించే నిర్బంధ విధానం మూలంగానూ, దోపిడీ మూలంగానూ రైతాంగ ప్రజాసామాన్యంలో విపరీత మైన అసంతృప్తి, ద్వేషభావమూ తప్పనిసరిగా పెరిగిపోతాయి. కష్టపడి జీవించే రైతాంగం తన స్వంతఅనుభవం ద్వారానే కార్మికవర్గమే తన నమ్మకమైన మిత్రుడుగా తెలుసుకో గలుగుతుంది. కార్మికవర్గంతో కలసిపోరాడితే గాని బూర్జువా - భూస్వామిక బానిసత్వాన్నుండి బయటబడటం సాధ్యంకాదని తెలుసుకోగలుగుతుంది.

రెండో అంతర్జాతీయసంస్థకు చెందిన మెన్షివిక్కులూ, అవకాశవాద పార్టీలు రైతాంగసమస్యపై నిరసన భావాన్ని కలిగివుండటం సహజమే. విప్లవం అంటే యీ పార్టీలకు ఎల్లప్పుడూ భయమే. శ్రామికవర్గ విజయంలో వీరికి విశ్వాసంలేదు. అందు వలననే విప్లవపోరాటంలో శ్రామికవర్గానికి అండగావుండే మిత్రులను ఏరుకొనే సమస్యనుగురించి వీరేమీ పట్టించుకోరు. రెండో అంతర్జాతీయసంస్థకు చెందినపార్టీలు రైతాంగంయెడల అవలంబించే యీ అసహ్యాకరమైన వైఖరిలోని విప్లవ వ్యతిరేక తను బట్టబయలు చేస్తూ కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు :

> "రైతాంగ సమస్యయెడల రెండో అంతర్జాతీయసంస్థకుచెందిన "ఈవీరుల" పరిహాసకరమైనవైఖరిని ఏదోసుగుణానికీ, "యదార్థ"మార్క్సిజానికి చిహ్నంగా భావించబడింది. కాని నిజానికి అందులో రవ్వంతైనా మార్క్సిజం లేదు. ఎందువల్లనంటే రైతాంగసమస్యలాంటి ప్రధానసమస్యపై సరిగ్గా శ్రామిక వర్గానికి ముందు ఉపేక్షాభావాన్ని కలిగివుండట మంటే శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిరాకరించడమే అవుతుంది. ప్రత్యక్షంగా మార్క్సిజానికి ద్రోహం చేయడమే అవుతుంది."
>
> — కలెక్టడ్ వర్క్సు, సంపుటి 6, పేజీ 124

శ్రామికవర్గాన్ని విప్లవానికి సంసిద్ధంచేసే బోల్షివిక్ పార్టీ విప్లవపార్టీవలే అధికారం హస్తగతం చేసుకొనడానికి తాను జరిపే పోరాటంలో శ్రామికవర్గానికి మిత్రుడుగా వుండే రైతాంగ సమస్యకు అత్యంత ప్రాముఖ్యతనిచ్చింది. లెనినిజంలో శ్రామిక వర్గానికి అండగావుండే మిత్రులను గురించి సమగ్రంగా విచారించబడింది. వివిధ సాంఘికవర్గాల ప్రయోజనాలనూ, వివిధ దశలలో వారు విప్లవం యెడల ప్రదర్శించే వైఖరులను ఆధారంగా చేసుకొని చక్కగా సమగ్రంగా వివరించబడింది.

శ్రామికవర్గ నాయకత్వ సమస్యపైన చర్చించుతూ లెనిన్ విప్లవంలో మార్క్సిస్టు పార్టీ అనుసరించాల్సిన వ్యూహం, ఎత్తుగడలను గురించి అత్యద్భుతంగా వివరించాడు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్నుండి సోషలిస్టు విప్లవానికి పరిణామంచెందే విధానానికి సంబంధించిన సిద్ధాంతాన్ని అభివృద్ధిచేశాడు. బూర్జువా విప్లవాన్నుండి సోషలిస్టు విప్లవంలోకి పరిణితిచెందే సందర్భంలో తప్పనిసరిగా సంభవించే వర్గశక్తుల నూతన కలయికను గురించి లెనిన్ తెలియజెప్పాడు.

ఒక నిర్మిత చారిత్రాత్మక సమయంలో గత కాలానికి సంబంధించిన శక్తులూ భవిష్యత్తుకు చెందిన శక్తులూ, ప్రజాస్వామికశక్తులూ సోషలిస్టు విప్లవశక్తులూ ఒకదానితో ఒకటి

ఖిలితమవుతాయని లెనిన్ తెలియజేశాడు. ఇంతమాత్రంచేత బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికీ సోషలిస్టువిప్లవానికీతప్పనిసరిగా ఖచ్చితంగావుండే తారతమ్యాలనుమరుగుపరచడానికిదీనిని సాకుగా వినియోగించరాదని లెనిన్ హెచ్చరించాడు. సోషలిజంకోసం అత్యున్నతమైన ప్రజాతంత్ర, రిపబ్లికన్ బూర్జువాశక్తులను సహితం శ్రామికవర్గం ఎదిరించడం తప్పనిసరి అవుతుందనే విషయాన్ని మార్క్సిస్టులు ఎన్నడూ మరచిపోరాదు.

సోషలిస్టు విప్లవానికి పరిణామం చెందడంతో వర్గశక్తులు తప్పనిసరిగా పునర్నిర్మించబడతాయి. విప్లవంలోని వివిధదశలలో మార్క్సిస్టుపార్టీ అనుసరించవలసిన పంథాను నిర్వచించుతూ లెనిన్ యిలా చెప్పాడు:

"సంపూర్ణ స్వాతంత్ర్యానికీ, ఖచ్చితమైన ప్రజాతంత్ర విప్లవానికీ రిపబ్లిక్ నిర్మాణానికీ మార్క్సిస్టుపార్టీ యావత్తు ప్రజానీకానికీ, ముఖ్యంగా రైతాంగానికి నాయకత్వం వహించి నడుపవలసిఉంది."

—కలెక్టెడ్ వర్క్సు, సంపుటి 9 పేజీ 91

బూర్జువా ప్రజాతంత్ర విప్లవం సోషలిస్టు విప్లవంగా పరిణితి చెందాలంటే శ్రామికవర్గ నాయకత్వం తప్పనిసరిగా వుండితీరాలని లెనిన్ స్పష్టపరచాడు. లెనిన్ యిదే సందర్భంలో మరొక విషయాన్నికూడా చెప్పాడు. అదేమంటే బూర్జువావర్గ ప్రతిఘటనను బలవంతంగా భగ్నంచేయడానికీ, రైతాంగానికీ ఛోటాబూర్జువాశక్తులకు సహజంగా వుండే అస్థిరత్వానికి స్వస్తిచెప్పడానికీ శ్రామికవర్గం ప్రజాసామాన్యంలోని శ్రామిక వర్గేతరశక్తులను కూడగట్టుకొని వారి అండతో సోషలిస్టు విప్లవాన్ని పూర్తి చేయవలసిఉంటుంది.

బూర్జువా ప్రజాతంత్రవిప్లవం సోషలిస్టు విప్లవంలోకి పరిణితిచెందే సిద్ధాంతాన్ని యింకా వివరించుతూ లెనిన్ వర్గపోరాటాన్ని గురించిన మార్క్సు ఉపదేశాలకూ, సోషలిస్టు విప్లవం జయప్రదం కావడానికి అవసరమైన పరిస్థితులకూ ఒక స్పష్టమైన ఆకారాన్ని యిచ్చాడు.

బూర్జువాసమాజంలోని అన్నివర్గాలమధ్య "సామరస్యం", "ఐక్యత" వుంటేనే అభివృద్ధి సాధ్యమవుతుందనే బూర్జువా, సంస్కరణ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా జరిపిన పోరాల్లోనే మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతం ఉత్పన్నమై, అభివృద్ధిచెందింది. వర్గపోరాటానికి సంబంధించిన మార్క్సిస్టు ఉపదేశాలను లెనిన్ స్టాలిన్‌లు కాపాడి అభివృద్ధిపరచారు. అంతేకాదు; అదేచరిత్రకు ప్రధాన నిర్ణయశక్తి అనికూడా వారు తెలిపారు. వర్గ ఆధిక్యతను అంగీకరించే సంస్కరణ సిద్ధాంతంలోని బూర్జువా సారాంశాన్ని, శ్రామికవర్గానికీ, బూర్జువా వర్గానికి మధ్య ఐక్యతనుప్రబోధించే వర్గసామరస్య సిద్ధాంతాన్ని బట్టబయలు చేశారు.

ఈ సందర్భంలో లెనిన్ యిలా అన్నాడు:

"సోషలిస్టు సిద్ధాంతాలప్రకారం,అంటే మార్క్సిజం ప్రకారం(మార్క్సిజం కానిసోషలిజాన్ని గురించిప్రస్తుతంమనంపెద్దగా పట్టించుకోనవసరంలేదనుకొండి)చరిత్రకునిజమైన నిర్ణయశక్తి వర్గాలయొక్క విప్లవ పోరాటాలే, సంస్కరణలన్నీ పోరా

టాల ఉపఫలితాలే. ఉపఫలితాలని పిలవడం ఎందుకంటే అవి పోరాటసంగ్రహాన్ని బలహీనపరచడానికి, కొంచెపరచడానికి చేసిన ప్రయత్నాల విఫలతవలన అవి జనించినాయి. బూర్జువా తత్వశాస్త్రవేత్తల ప్రకారం సమాజంలోని వివిధశక్తుల ఐక్య సంఘటనలే అభివృద్ధి నిర్ణాయకశక్తి. వారి ప్రకారం అన్నింటిలో "అసంపూర్ణత్వం" యిమిడిఉంటుంది. మొదటి సిద్ధాంతం భౌతికవాదం. రెండోది భావవాదం. మొదటిదివిప్లవాత్మకమైనది. రెండోది సంస్కరణవాదం మొదటిగిఆధునిక పెట్టుబడిదారీ దేశాలలో శ్రామికవర్గ ఎత్తుగడలను నిర్ణయించుతుంది. రెండోది బూర్జువా ఎత్తుగడలను నిర్ణయించుతుంది."

—కలెక్టడ్‌వర్క్సు, సంపుటి 11, పేజీ 54

ఆధునిక మితవాద సోషలిస్టులు "ప్రజాతంత్ర సోషలిజం" పేరిట వర్గపోరాట సిద్ధాంతాన్ని నిరాకరించడానికి అన్నివిధాలా ప్రయత్నించుతారు. "స్థిరమైన" సాంఘిక అభివృద్ధి అనే బూర్జువా సిద్ధాంతాన్ని పట్టుకొని వ్రేళ్లాడతారు. గుత్తపెట్టుబడిదారులు ఒక సెంట్రుకవాసి నష్టపడటమన్నా, పీడకవర్గాల ప్రయోజనాలు ఏమాత్రం దెబ్బతినడమన్నా మితవాద సోషలిస్టులు అమితంగా భయపడతారు. ఇది వారి దృష్టిలో "ప్రజాతంత్రాన్ని అతిక్రమించడ" మవుతుంది!

మితవాద సోషలిస్టులు తాము సోషలిజంకోసమే పోరాడుతామని ప్రకటనలు చేస్తారు. కాని అదే సమయంలో వారు పెట్టుబడిదారులతో ఏకమైతేనే సోషలిజాన్ని సాధించడం సాధ్యమవుతుందని కార్మికులకు నచ్చచెప్పడానికి ప్రయత్నించుతారు. బూర్జువావర్గంచే అంగీకరించబడ్డ శాసనాలనే ఆచరణలో పెట్టడానికి వారు సిద్ధపడతారు. అంటే బూర్జువావర్గానికి అనుకూలంగావుండే శాసనాలనే చేస్తారన్నమాట.

బ్రిటిష్ లేబర్‌పార్టీ నాయకుడు అట్లీ పెట్టుబడిదారీ విధానాన్ని "ప్లాన్డ ఎకానమీ"తో మిళితంచేసి సోషలిజాన్ని సాధించవచ్చునని ప్రకటనలను చేస్తాడు. పెట్టుబడిదారీ విధానానికి భంగం కలుగనీయరాదనే యీ భావాన్నే లేబరుపార్టీ సిద్ధాంతకర్త హెరాల్డులాస్కీ బలపరుస్తూ, సాంఘిక విప్లవాన్నుండి తప్పించుకోవాలంటే కార్మికులతో సామరస్యంగా వుండవలసిందిగా బ్రిటిష్ బూర్జువావర్గానికి విజ్ఞప్తులు చేస్తాడు.

లేబరునాయకులు కార్మికులను మోసంచేసే యీ ప్రయత్నంలో "స్వతంత్ర సోషలిస్టు" కింగ్స్లీమార్టిన్ కూడా వారికి సహాయపడుతున్నాడు. సోషలిజాన్ని వర్గ పోరాటం ద్వారా కాక ఎన్నికలలో 'సోషలిస్టు'లు నెగ్గడంద్వారా సాధించవచ్చునని యితగాడు కార్మికులకు హామీ యిస్తాడు.

లేబర్‌పార్టీ ప్రతిపాదించే "సోషలిస్టు పంథా" ఆచరణలో పెట్టుబడిదారులను మరింత భాగ్యవంతులను చేసి కార్మికులను దరిద్రులను చేస్తుంది. లేబరు ప్రభుత్వ పరిపాలనలో పెట్టుబడిదారుల లాభాలు ఒకటిన్నర రెట్లు పెరిగాయి. కష్టపడి జీవించే శ్రామికప్రజల ఆహారరేషన్లు ఒకటిన్నర రెట్లు తగ్గించబడ్డాయి.

వర్గపోరాటాన్ని, శ్రామికవర్గనాయకత్వాని[illegible] మూలంగా ఆచరణలోవారు పెట్టుబడిదారీ విధానాన్ని [illegible] బూర్జువా

వర్గానికి సహాయపడుతున్నారు. కార్మికులు సోషలిజం కోసం పోరాడకుండా వారిని తప్పుదారిని పట్టించుతున్నారు. మితవాదసోషలిస్టులు "ప్రజాతంత్ర సోషలిజం" అనే సిద్ధాంతాన్ని పైకి లేవనెత్తి ప్రచారం చేస్తున్నారు. ఇది బూర్జువావర్గానికి పూర్తిగా అంగీకారమైన సిద్ధాంతం. ఈసిద్ధాంతం ద్వారా వారు ప్రజాస్వామికం, సోషలిజం అని పెద్దపెద్దమాటలు చెపుతూ కార్మికులను సిద్ధాంతరీత్యా బందిఖానాలో వుంచి బూర్జువాసమాజంలోని వర్గవైరుధ్యాలనూ, వర్గాలను తుదముట్టించడాన్ని అతిక్రమించవచ్చునని ఆశించుతున్నారు.

ఈ "ప్రజాతంత్ర సోషలిజం" అనేది సోషలిజం కోసం జరిగేపోరాటంలో శ్రామికవర్గ నాయకత్వ పాత్రను సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా నిరాకరించడం కాక మరొకటికాదు. ఇది ఆచరణలో శ్రామికవర్గాన్ని బూర్జువావర్గంముందు లొంగుబాటువహించే సిద్ధాంతం.

ఈ "ప్రజాతంత్ర సోషలిజం" సోషలిజానికి వ్యతిరేకంగా కాపిటలిజాన్ని కాపాడుకొనేందుకు బూర్జువావర్గం చేతిలో ఒక సిద్ధాంత, రాజకీయ ఆయుధం.

దోపిడీవర్గాలను బలవంతంగా కూలద్రోసి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించడమే సోషలిస్టు విప్లవంయొక్క ప్రధానసూత్రమని మార్క్సిజం-లెనినిజం బోధించుతున్నది. మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ నాయకత్వాన కార్మికవర్గమొక్కటే దోపిడిదారులకు వ్యతిరేకంగా వర్గపోరాటాన్ని తుదివరకూ సాగించగలుగుతుంది. అదొక్కటే కష్టజీవులలోని శ్రామికవర్గేతర ప్రజాసామాన్యాన్ని ఐక్యంచేసి, వారికి జ్ఞానభిక్షపెట్టి వారిని సోషలిజానికి కొనిపోగలుగుతుంది.

సోషలిస్టు విప్లవంయొక్క యీ ప్రధానసూత్రం ప్రాధాన్యతను చరిత్ర రుజువుచేసింది. సోవియట్ యూనియన్‌లోని అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం, అక్కడ సోషలిస్టు వ్యవస్థవిజయం - యీ రెండూ, శ్రామికవర్గ నియంతృత్వంపై మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతంలోని అమరసత్యాన్ని రుజువుచేశాయి. శ్రామికవర్గ నియంతృత్వమనే లెనినిస్టు సిద్ధాంతాన్ని అక్టోబరు సోషలిస్టు విప్లవం ఆచరణలోపెట్టి చక్కటి సజీవమైన ఉదాహరణ చూపెట్టగలిగిందని కామ్రేడ్ స్టాలిన్ ఎత్తిచూపెట్టాడు.

పెట్టుబడిదారీ సమాజాన్ని సోషలిస్టు సమాజంలోకి మార్చాలంటే వర్గ పోరాటాన్ని ఎడతెగకుండా కొనసాగించవలసిన అత్యావశ్యకతఉంది. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతంలోని అసలు కీలకంయిదే. పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పార్లమెంటరీ ఎన్నికలద్వారా శాంతియుతంగా పరిణితిచెందవచ్చుననే అవకాశవాద భావాలు మార్క్సిజం లెనినిజానికి పూర్తిగా ప్రత్యక్ష విరుద్ధం.

పెట్టుబడిదారీ దేశాలలో దోపిడివర్గాలు శ్రామిక ప్రజానీకానికి చెందిన పీడిత జనసామాన్యాన్ని తమ అధీనంలో ఎడతెగకుండా బలత్కార పద్ధతులద్వారా వుంచడంద్వారానే [illegible] వర్గం తన పరిపాలనను కొనసాగించుకోగలుగుతున్నదనే విషయం అంద[illegible]నసంగతే. పెట్టుబడిదారీదేశాలలోని ప్రజాతంత్ర సంస్థలు ఆ[illegible] బూర్జువా నియంతృత్వాన్ని బహిరంగంగా నగ్న

రూపంలో కనపడకుండా మరుగుపరచడానికి మాత్రమే నెలకొల్పబడతాయి. కష్టజీవులైన ప్రజలపై పరిమితిలేని తమ పెత్తనాన్ని మరుగుపరచడానికి యీ ప్రజాతంత్రసంస్థలు ఎలాంటిరకమైన ఎన్నికల తతంగమైనా పార్లమెంటులైనా అధికారాన్ని బూర్జువా వర్గాన్నుండి గుంజుకొని పెట్టుబడిదారుల పాలనను తుదముట్టించలేవు.

సోషలిజంకోసం పోరాడడానికి అనుకూల పరిస్థితులు సృష్టించేందుకు కార్మిక వర్గం ప్రజాతంత్రహక్కులకొరకు పోరాడుతుంది. పెట్టుబడిదారీ బానిసత్వాన్నుండి పార్లమెంటరీ పద్ధతులద్వారానే విముక్తిపొందడం సాధ్యపడుతుందని హామీలిచ్చే మితవాద సోషలిస్టులు శ్రామికవర్గంచే బూర్జువా నియంతృత్వం బలవంతంగా కూలద్రోయబడకుండామాత్రమే కాపాడుతూవుంటారు. శ్రామికప్రజలపై బూర్జువావర్గం జరిపే దౌర్జన్యకాండను ఒక్క విప్లవ వర్గపోరాటంద్వారానే తుదముట్టించడం సాధ్యమవుతుంది.

ఈ సందర్భంలో లెనిన్ యిలా చెప్పాడు :

"శ్రామికవర్గ నియంతృత్వం అంటే ఒక వర్గం- శ్రామికవర్గంచే బూర్జువా వర్గం అనికారాన్నుండి కూలద్రోయబడటమన్నమాట. దీనినే యింకా స్పష్టంగా చెప్పాలంటే దాని (శ్రామికవర్గం) విప్లవకరమైన అగ్రగామిచే కూలద్రోయబడటమన్నమాట. ఈ అగ్రగామిదళం ముందుగానే బూర్జువా పార్లమెంటులోనూ, బూర్జువా సంస్థలలోనూ మెజారిటీని వోటింగుద్వారా తెచ్చుకోవాలని భావించడం-అందులోనూ **బానిసకూలీవిధానం అమలులోవుండగా,** దోపిడీ వర్గాలు అలాగే వుండగా, వారి క్రింద నిర్బంధం సాగుతూవుండగా, వ్యక్తిగత ప్రయివేటు ఆస్థికి సంబంధించిన ఉత్పత్తి విధానం అమలులోవుండగానే -ఇదంతా (మెజారిటీని సంపాదించడం) సాధ్యపడుతుందని వూహించడం, లేక అలానమ్మడంఅంటే శ్రామికవర్గ దృక్పథాన్ని సంపూర్తిగావదులుకొని బూర్జువా ప్రజాతంత్ర దృక్పథాన్ని ఆచరణలో అంగీకరించడమే అవుతుంది."

—కలెక్టడ్‌వర్క్సు, సంపుటి 25 పేజీ 307

"ఎంతో ఉన్నత ప్రజాతంత్ర ఎన్నికలలో" సహితం బూర్జువా వర్గానికి వోటర్లపై వొత్తిడితెచ్చిపెట్టడానికి వారిచేతిలో వెయ్యిపద్ధతు లుంటాయి. ప్రజాసామాన్యాన్ని మోసం చేయడానికి వేయివిధాల ట్రిక్కులుంటాయి. ఓటర్ల అభీష్టాన్ని తప్పుగా ప్రతిబింబించడానికి వారిచేతిలో అనేక సాధనాలుంటాయి. ఈ సత్యాన్ని చరిత్ర తన అనుభవంద్వారా చాటిచెప్పుతోంది. బూర్జువావర్గం చేతిలో రాజ్యాంగ యంత్రం వున్నంతకాలం, ఆర్థిక జీవితానికి సంబంధించిన అన్ని వ్యవహారాలు దాని చేతులలో వున్నంతకాలమూ, ప్రచారకసాధనాలన్నీ దానిఆధీనంలో వున్నంతకాలమూ దాని ప్రతినిధులకు ఎలాంటి పార్లమెంటులో అయినా మెజారిటి వుండితీరుతుంది. బూర్జువావర్గానికి అణగిమణగి వుండే ఏజెంట్లకు మెజారిటి వుండితీరుతుంది.

కార్మికవర్గ అగ్రగామి మెజారిటీ కార్మికుల అండతో దోపిడిదారుల పాపాలనను అంతమొందించి, ప్రజానీకాన్ని ఆర్థిక, రాజకీయ, నైతిక బానిసత్వాన్నుండి విము

పరచిన తరువాతనే పెద్ద ఎత్తున ప్రజలను రాజకీయంగా విజ్ఞానవంతులనుచేసి, కష్టపడి జీవించే బహుళ జనసామాన్యాన్ని శ్రామికవర్గంచుట్టూ ఐక్యపరచగలగడం సాధ్యపడు తుంది. అప్పుడే శ్రామిక జనసామాన్యం తమ నిజమైన అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటించడానికి వీలవుతుంది.

దోపిడివర్గాల అధికారాన్ని కూలద్రోసిన వెంటనే వర్గపోరాటం సమాప్తి చెందదు. పైగా అది యింకా తీవ్రతరమవుతుంది. ఈ సత్యాన్ని మార్క్సిజం - లెనినిజం ముందుగా చూడగలిగింది. అక్టోబరు సోషలిస్టు విప్లవం అత్యంత వివరంగా దీనిని రుజువు చేసింది.

ఈ సందర్భంలో లెనిన్ యిలా చెప్పాడు:

"పెట్టుబడిదారీ విధానానికీ, కమ్యూనిజానికీ మధ్యనున్న కాలం ఒక చారిత్రాత్మకదశ. ఈ దశ సమాప్తి అయ్యేవరకూ దోపిడీవర్గాలు తిరిగి తాము అధికారానికి రావచ్చుననే ఆశతో ఉబలాటపడతారు. ఈ ఆశతోనే వారు తిరిగి అధికారాన్ని గుంజుకోవడానికి ప్రయత్నాలు చేస్తారు. తాము కూలద్రోయబడుట అసంభవమనీ, అది ఎన్నడూ జరుగదని తలచి అటువంటి ఆలోచనకు కూడా అవకాశమివ్వని బూర్జువావర్గం మొట్టమొదటిసారిగా గట్టి దెబ్బతిని పడిపోయిన తరువాత పదిరెట్లు ఎక్కువశక్తితో, వందరెట్లు అధికమైన ద్వేషముతో తామూ, తమ కుటుంబాలు హాయిగా అనుభవించిన సుఖజీవితంతో కూడిన "స్వర్గరాజ్యాన్ని" తిరిగి నెలకొల్పుకొనడానికి రణరంగంలోకి దుముకుతారు......"

"ఈ పెట్టుబడిదారీ దోపిడిదారులతో ఛోటాబూర్జువావర్గానికి చెందిన ప్రజాసామాన్యంకూడా కలుస్తుంది. ఈ ఛోటాబూర్జువావర్గం ఎప్పుడూ సందేహిస్తూ, మధ్య ఊగులాడుతూ ఒకరోజున శ్రామికవర్గం వెనుకనూ, మరోరోజున విప్లవంలోని కష్టాలకు భయపడి పారిపోవడం జరుగుతుంది. కార్మికులు ఒకవేళ మొదటిసారి ఓడిపోతే, లేక దాదాపు ఓడిపోతే యీ ఛోటాబూర్జువావర్గం భయోత్పాతంతో బీభత్సమై, నిరుత్సాహపడి, దారి డొంక తెలియక ఒకపక్షాన్నుండి మరొకపక్షానికి...మన మెన్షివిక్‌లూ, సోషలిస్టు రివల్యూషనరీలవలే పరుగెత్తుతారని ప్రతిదేశచరిత్రా గడించిన అనుభవం తెలియజేస్తున్నది."

— సెలక్టడ్‌వర్క్స్, 7 వ సంపుటం పేజీలు 140–41

దోపిడీవర్గాల ప్రతిఘటనను దయాదాక్షిణ్యం లేకుండా కఠినంగా అణచివేయడం ద్వారానే కార్మికవర్గం సమాజాన్ని సోషలిస్టు పద్ధతులతో పునర్నిర్మించడంలో తన నాయకత్వ పాత్రను సక్రమంగా నిర్వహించగలిగి, సోషలిజాన్ని సాధించగలుగుతుందని సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు విప్లవం గడించిన అనుభవం స్పష్టపరుస్తున్నది.

అక్టోబరు విప్లవంలో అధికారాన్నుండి కూలద్రోయబడిన దోపిడీవర్గాలు విదేశాల సామ్రాజ్యవాదుల సహాయంతో సోవియట్ ప్రభుత్వానికివ్యతిరేకంగా సాయుధ

తిరుగుబాటును లేవదీశారు. సోవియట్ యూనియన్‌లో జరిగిన యీ అంతర్యుద్ధం శ్రామికవర్గం బూర్జువా-భూస్వామికవర్గాలకు ప్రతికూలంగా సాగించిన సమరం. వర్గ పోరాట తీవ్రరూపానికి చిహ్నం. స్వదేశంలోని విప్లవ ప్రతీఘాతిశక్తులూ, జోక్యం కలిగించుకొన్న విదేశసామ్రాజ్యవాదులు మిలిటరీ రీత్యా ఓడిపోవడంతో పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా శ్రామికవర్గం సలిపిన వర్గపోరాటానికి ప్రపంచచారిత్రాత్మక విజయం చేకూరింది.

ఇంత జరిగినా అప్పటికీ వర్గపోరాటం సమాప్తిచెందలేదు. అది నూతన రూపాలను దాల్చింది. అంతేకాక సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకశక్తులు యీఅవకాశాన్ని వినియోగించుకొని విదేశసామ్రాజ్యవాదుల సహాయాన్ని తీసుకొన్నారు. ఇక సామ్రాజ్యవాదులు సోవియట్‌రాజ్యాన్ని కూలద్రోయడానికి ఎలాంటి పద్ధతిని అనుసరించడానికి కూడా వెనుదీయలేదు.

పరిణామదశలో సోవియట్ సమాజం లెనిన్ చెప్పిన "ఎవరిపైన ఎవరు విజయం పొందుతారు ?" అన్న సూత్రాన్ని అనుసరించి అభివృద్ధి అయింది. పెట్టుబడిదారీశక్తులకు వ్యతిరేకంగా సోషలిస్టుశక్తుల విజయంకోసం బోల్షివిక్ పార్టీ శ్రద్ధగా తన కార్యక్రమాన్ని కొనసాగించింది. సోవియట్ ప్రభుత్వ విజయాలు పెట్టుబడిదారీశక్తులనుండి మరింత తీవ్ర ప్రతిఘటనను తెచ్చాయి. సోవియట్ ప్రభుత్వం పరిశ్రమలనూ, బ్యాంకులనూ, రవాణానూ, భూమినీ జాతిపరం చేయడంతో పెట్టుబడిదారుల, భూస్వాముల పెత్తనానికి ఆధారభూతమైన ఆర్థిక నాళాలు త్రెంచివేయబడ్డాయి. ఇంకా అప్పటికీ దోపిడివర్గాలు అంతరించలేదు.

బోల్షివిక్‌పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ "నూతన ఆర్థిక విధాన"దశలో కొనసాగించిన పాలసీ ఫలితంగా పెట్టుబడిదారీశక్తుల బలాన్ని అంతరింపజేసి వాటిశక్తిని చాలభాగం పరిమితం చేసింది.

దోపిడీవర్గాలు సామ్రాజ్యరాజ్యాలకు అనుకూలంగా విధ్వంసక కార్యక్రమాన్ని విచ్ఛిన్న కుతంత్రాలనూ సాగించి, విజయవంతంగా పురోగమించుతున్న సోషలిజాన్ని తెగించి ప్రతిఘటించాయి. అంతేకాక పార్టీలోపల విదేశ బూర్జువారాజ్యాలకు ట్రాట్స్కీ, బుఖారిన్‌లాంటి ఏజంట్లున్నారు. ఈ విద్రోహకర ఏజెంట్లు సోవియట్ రాజ్యంలో పార్టీనాయకత్వ పాత్రను కొంచపరచడానికీ, పార్టీ అనుయాయుల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికీ, పార్టీని లెనినిస్టు పంథానుండి తప్పించి, పార్టీని పెట్టుబడిదారీ విధానాన్ని తిరిగి నెలకొల్పే, సామ్రాజ్యవాదరాజ్యాలకు లొంగిపోయేబాటలో ప్రవేశపెట్టాలని శతవిధాల ప్రయత్నించారు.

లెనినిస్టు - స్టాలినిస్టు పంథాననుసరించి దేశాన్ని సోషలిస్టు పద్ధతులలో పారిశ్రామికవంతం చేయడం, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నెలకొల్పడం సోషలిజం విజయానికి అత్యంత ప్రాముఖ్యతను తెచ్చిపెట్టింది. అంతేకాక యిది దోపిడీవర్గాలను తుదముట్టించింది. ఎందువల్లనంటే ఈ పంథాను ఆచరణలో పెట్టడంమూలంగా పట్టణాలలోనూ, పల్లెలలోనూ పట్టుబడిదారీ శక్తులు పరిపూర్ణంగా నాశనమయ్యాయి.

అందుకనే పెట్టుబడిదారీ శక్తులూ, విదేశాల సామ్రాజ్యవాదులూ వారి బంట్లు – ట్రాట్స్కీ, బుఖారిన్ ముఠాలూ దేశాన్ని పారిశ్రామికం చేయడాన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నెలకొల్పడాన్ని విపరీతమైన ద్వేషపూరిత పట్టుదలతో వ్యతిరేకించారు ఈ విధంగా వారు ప్రతిఘటించడం యేదో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనగా భావించరాదు.

చరిత్రలో మొట్టమొదటిసారిగా బోల్షివిక్ పార్టీ సోషలిస్టు ఆర్థిక విధాన నిర్మాణానికి సంబంధించిన బ్రహ్మాండమైన నిర్మాణాత్మక బాధ్యతను నిర్వహించవలసివచ్చింది. తిరిగి దానిని సోషలిస్టు శ్రామిక క్రమశిక్షణతో కొద్దిపాటి స్కేలుపై ఉత్పత్తి విధానంతో సమన్వయపరచవలసివచ్చింది. ఈ మహత్తరమైన బాధ్యతలను నిర్వహించడానికి సోషలిస్టుసమాజ నిర్మాతగా కార్మికవర్గ ప్రధానపాత్ర మరింత అధికమయింది. రాజ్యాంగయంత్రం సహాయంలేకుండా కార్మికవర్గ నాయకత్వ సలహాలు లేకుండా యావత్తు సమాజఅభివృద్ధికి సంబంధించిన మహత్తర బాధ్యతలను నెరవేర్చడం సాధ్యం కాదు.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాననే కార్మికవర్గం యీ చరిత్రాత్మక కర్తవ్యాలను నెరవేర్చగలిగింది. లెనినిస్టు వ్యతిరేకగ్రూపు లన్నింటినీ నాశనంచేసి, బోల్షివిక్ పార్టీ కార్మికవర్గ అనుయాయులలో ఐక్యతను నెలకొల్పింది. సోషలిస్టు విప్లవానికిపూర్వమే కార్మికవర్గంలో మెన్షివిక్కులకూ, ఇంకా యితర బూర్జువావర్గ ఏజంట్లకూగల పలుకుబడిని తుదముట్టించి, ఆవిధంగా కార్మికవర్గంలో ఆంతరంగికంగా చీలికలు లేకుండా చేసింది.

సోషలిస్టు విప్లవ విజయానికి, సోవియట్ యూనియన్‌లో కార్మికవర్గం జయప్రదంగా సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి ఒకేఒకపార్టీ- బోల్షివిక్ పార్టీ అఖండ నాయకత్వమొక్కటే కారణభూతం.

లెనిన్ యిలా బోధించాడు :

"కార్మికవర్గపార్టీని రాజకీయంగా విజ్ఞానవంతం చేస్తూ, మార్క్సిజం శ్రామికవర్గ అగ్రగామిని రాజకీయాధికారాన్ని గుంజుకునేందుకు శక్తివంతంచేసి, యావత్తుప్రజానీకాన్ని సోషలిజానికి పురోగమింపజేసి, నూతనవ్యవస్థను నిర్మించడానికి తోడ్పడుతుంది. బూర్జువావర్గం లేకుండా, బూర్జువావర్గంపెట్టే అడ్డంకులను అధిగమించి, తమ సాంఘికజీవితాన్ని నిర్మించుకొనేబాధ్యతనునిర్వహించడానికి యావత్తు శ్రామిక, పీడిత ప్రజానీకానికి కార్మికవర్గపార్టీ గురువుగా, మార్గదర్శిగా, నాయకుడుగా ఉంటుంది."

— కలెక్టడ్ వర్క్సు, సంపుటి 21, పేజీ 386

పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పరిణామంచెందే దశలోనూ' దోపిడీదారులకు వ్యతిరేకంగా కార్మికవర్గం కఠినమైన పోరాటాన్ని కొనసాగించుతున్న దశలోనూ, ఛోటా బూర్జువాశక్తులకు వ్యతిరేకంగాపోరాటం జరుపుతున్న దశలోనూ పార్టీలో క్రమశిక్షణ వుండవలసిన ఆవశ్యకత మరింత ఎక్కువగుతుందని లెనిన్

స్పష్టపరచాడు. ఆ సమయంలో పార్టీ నిర్వహించవలసిన పాత్రను కాదని పార్టీ క్రమ శిక్షణను అతిక్రమించడమంటే బూర్జువావర్గానికి అనుకూలపడేటట్లు శ్రామికవర్గాన్ని నిరాయుధం చేయడంతో సమానమవుతుందని లెనిన్ బోధించాడు.

పార్టీ నాయకత్వ ప్రాముఖ్యతను గురించిన లెనిన్ భావాలను యింకా అభివృద్ధి పరుస్తూ కామ్రేడ్ స్టాలిన్ అన్ని విధాలా పార్టీ శ్రామికవర్గ సంస్థ అత్యున్నత స్వరూపమని విశదీకరించాడు. శ్రామికవర్గ నియంతృత్వాన్ని సాధించడానికీ ఆ తరువాత దానిని సంఘటితపరచుకొని, విస్తరింప జేయడానికీ పార్టీ కార్మికవర్గం చేతిలో ప్రధాన ఆయుధమనికూడా కామ్రేడ్ స్టాలిన్ స్పష్టంగా చెప్పాడు.

"అయితే శ్రామికవర్గ నియంతృత్వాన్ని 'నిలబెట్టి' 'విశాలపరచుట' అంటే అర్థమేమిటి? కోటానుకోట్ల శ్రామికులందరిలో నిర్మాణశిక్షణా భావాలను పెంపొందించి ఉత్తేజపరచుటయే; ఛోటా బూర్జువాపార్టీలయొక్క ప్రభావాన్ని యెదుర్కొ-గలిగినటువంటీ, ఛోటాబూర్జువావర్గ అలవాట్లనూ, సాంప్రదాయాలను నిర్మూలించునటువంటి బ్రహ్మాండమైన శక్తిని కార్మికులలో అభివృద్ధిచేయుటయే; ఛోటా బూర్జువావర్గానికి చెందిన వారందరికీ తిరిగి శిక్షణ యిచ్చి, నూతన మానవులుగా తయారుచేయుటకై కార్మికులయొక్క నిర్మాణ శక్తిని అభివృద్ధి గావించి శిక్షణ యిచ్చుటయే; వర్గాలనన్నింటినీ నిర్మూలించి, సోషలిస్టు ఉత్పత్తివిధానాన్ని నిర్మించడానికి తగిన పరిస్థితులను తయారు చేయడానికి అవసరమైన శక్తిగా కార్మికవర్గమంతా శిక్షణపొందుటకు సహాయపడుటయే. కాని గొప్ప క్రమశిక్షణా, దృఢమైన ఐక్యతగల ఒకపార్టీ లేనిదే యీ మహాత్కార్యాలన్నీ సాధించడం పూర్తిగా అసాధ్యం."

— స్టాలిన్.

(ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం 88 పేజీ)

సోవియట్ యూనియన్‌లోని కార్మికవర్గం పార్టీ ఆధ్వర్యాన, లెనిన్, స్టాలిన్‌ల నాయకత్వాన పెట్టుబడిదారీశక్తులకూ, వారిఏజెంట్లకూ వ్యతిరేకంగా నిర్దాక్షిణ్యంగా వర్గపోరాటాన్ని సాగించి సమాజాన్ని సోషలిస్టు పద్ధతులపై పునర్నిర్మించింది. లెనిన్, స్టాలిన్‌లు పార్టీకి వర్గాలూ, వర్గపోరాటాన్ని గురించిన మార్క్సిస్టు సిద్ధాంత దృష్టితో ఎడతెగకుండా శిక్షణనిచ్చారు. పెట్టుబడిదారీశక్తులు శాంతియుతంగా సోషలిజాన్ని అంగీకరిస్తాయని ప్రచారం చేసే బుఖారిన్ అనుయాయుల లొంగుబాటు ధోరణులను బోల్షివిక్‌పార్టీ ఎదిరించి నాశనం చేసింది.

పెట్టుబడిదారీశక్తులనూ, పెట్టుబడిదారీ పరిపాలననూ నిర్మూలించడం ఎలాంటి సంకోచం లేకుండా నిర్దాక్షిణ్యమైన ఒక్క వర్గపోరాటంద్వారా సాధ్యపడుతుందని చెప్పే మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని కామ్రేడ్ స్టాలిన్ బలపరచి కాపాడాడు.

"తీవ్రతరమైన వర్గపోరాటం లేకుండా కాపిటలిస్టులను పరిమార్చగలమా? పెట్టుబడిదారీ విధానపు మూలపునాదులను నిర్మూలించగలమా ? లేదు, అలా చేయడం సాధ్యంకాదు. పెట్టుబడిదారులు సోషలిజాన్ని శాంతియుతంగా అంగీక

రించుతారనే సిద్ధాంతమూ, ఆచరణా అమలులో వుండగా వర్గాలను రద్దు చేయడం సాధ్యమవుతుందా? లేదు; అరకమైన సిద్ధాంతమూ, ఆచరణ వర్గాలను అలాగేవుంచి శాశ్వతం చేస్తాయి ఎందువల్లనంటే యీ సిద్ధాంతం వర్గ పోరాట సిద్ధాంతానికి ప్రత్యక్ష విరుద్ధం."

— స్టాలిన్

(ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, పుట 252)

దోపిడీ వర్గాలను తుదముట్టించి, పెట్టుబడిదారీ విధానాన్ని మొదలంటా పునాదులతోనే సర్వనాశనం చేయాలంటే భూస్వాములనూ, పెట్టుబడిదారులనూ అంతం చేయడమేగాక చిన్న ఉత్పత్తిదారులకు అదే పనిగా నూతన శిక్షణను యిస్తూ కొద్దిపాటి వస్తోత్పత్తిని కొత్తపద్ధతులపై పునరుద్ధరించవలసిన అవసరముంది. గ్రామసీమల్లో కొద్దిపాటి వస్తోత్పత్తి ఆర్థిక విధానానికి ఆధిక్యత ఉన్నంతకాలం పెట్టుబడిదారీ వ్యవస్థ పునాదులు కూడా అలాగే వుండిపోతాయి. ఎందువల్లనంటే లెనిన్ చెప్పినట్లుగా కొద్దిపాటి ఉత్పత్తి విధానం క్రమేణా, రోజురోజుకూ, గంటగంటకూ దానంతటదే పెద్దపెట్టున పెట్టుబడిదారీ విధానానికీ, బూర్జువావర్గ జననానికి అవకాశంయిస్తుంది.

**1917** లో సోషలిస్టు విప్లవ కోసం పార్టీ యింకా తన శక్తులను కూడగట్టుకొని, సంఘటితపరచుకొంటున్న సమయంలోనే లెనిన్ 'ప్రవదా' పత్రికలో యిలా వ్రాశాడు.

"మార్కెట్టుకోసం, కేపిటలిజంకోసం ఎక్కడయితే వస్తోత్పత్తి జరుగుతుందో అక్కడ కొద్దిపాటి స్కేలుపై జరిగే ఉత్పత్తి విధానం మానవజాతిని దరిద్రాన్నుండి విముక్తిచేయలేదు. అందువలన దానిని పెద్దఎత్తుపై జరిగే ఉత్పత్తి విధానానికి మార్చేందుకు ఆలోచించడం అవసరం. ఈ విషయాన్ని రైతుల నుండిగాని ముఖ్యంగా గ్రామసీమల్లోని శ్రామికులూ, అర్ధ శ్రామికులనుండిగానీ మనం దాచలేము.

— కలెక్టెడ్‌వర్క్స్ సంపుటి 20, పేజీ 220

సోషలిస్టు విప్లవం విజయంపొందినతరువాతకూడా లెనిన్ కొద్దిపాటివస్తోత్పత్తిపై ఆధారపడే ఆర్థికవిధానాన్ని తిరిగి పునర్నిర్మించకుండా వర్గాలను నాశనం చేయడం అసాధ్యమని అనేకసార్లు చెప్పాడు.

లెనిన్ యిలా అన్నాడు:

"... వారిని గెంటివేయడానికి వీలులేదు, వారిని అణచివేయడానికికూడా వీలులేదు. వారితో మనం సామరస్యభావంలో కలిసి వుండాలి వారికి క్రమేణా, మెల్లగా, జాగ్రత్తగా నిర్మాణకృషిద్వారా శిక్షణనుయిస్తే వారిని మార్చవచ్చు, మారితీరుతారు."

—కలెక్టెడ్‌వర్క్స్, సంపుటి 25 పుట 189

పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా సోషలిస్టు విజయంకోసం యీ పంథాలను అనుసరిస్తూ బోల్షివిక్ పార్టీ కార్మికవర్గ నాయకత్వాన కార్మికవర్గానికి శ్రామికరైతాం

గానికి మధ్య మిత్రత్వాన్ని సంఘటితపరచడానికి ఎల్లప్పుడూ జాగ్రత్తపడుతూనే వుంది. రైతాంగమంతా ఒకేరకమైన సముదాయం కాదనీ రైతాంగంయెడల అనుసరించాల్సిన పాలసీలో దానిలో అంతర్గతంగావున్న వర్గతారతమ్యాలను దృష్టిలోవుంచుకోవాలనీ లెనిన్, స్టాలిన్‌లు చెప్పిన సలహాలను పార్టీ పాటింపుతూనేవుంది.

"మనదేశంలో ప్రస్తుతంవున్న పరిస్థితుల ప్రకారం రైతాంగం మూడు సాంఘిక గ్రూపులుగా విభజించబడివుంది. ఒకటి : పేదరైతులు, రెండు : మధ్యతరగతి రైతులు, మూడు : కులక్‌లు (ధనికరైతులు) అందువలన యీవివిధ గ్రూపులయెడల మనవైఖరి ఒకేవిధంగా వుండదనేవిషయం సహజమే. కార్మికవర్గాన్ని పేదరైతు బలపరుస్తాడు. మధ్యతరగతి రైతు మిత్రుడుగా వుంటాడు. ధనికరైతు (కులక్) వర్గశత్రువుగా వుంటాడు — రైతాంగంలోని యీ ప్రత్యేక గ్రూపులయెడల మనవైఖరి ఆవిధంగా వుంటుంది..."

— స్టాలిన్

(ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం. పుట 257)

కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన పార్టీ ట్రాట్స్కీ-ముఠానూ, బుఖారిన్ ముఠానూ నాశనంచేసింది. ట్రాట్స్కీ-ముఠా కార్మికవర్గ శ్రామికరైతాంగ జనసామాన్యంతో కలసిమిత్రత్వం నెరపాలనే పాలసీని వ్యతిరేకించింది. బుఖారిన్ ముఠా రైతాంగంలో వుండేవర్గతారతమ్యాలనుగుర్తించకుండా ధనికరైతులు కూడా సోషలిజానికి సానుకూలపడతారనే సిద్ధాంతాన్ని ప్రచారంచేసింది.

ట్రాట్స్కీ-వాద విద్రోహులు కార్మికవర్గం శ్రామికరైతాంగం యెడల విరోధభావం కలిగివుండేటట్లు చేయడానికీ, కార్మికవర్గానికి మధ్యతరగతి రైతాంగంతో గల మిత్రత్వాన్ని విచ్ఛిన్నంచేయడానికీ, శ్రామికవర్గ నియంతృత్వ ప్రాతిపదికను దెబ్బతీయడానికీ తమ శక్తినంతటినీ వినియోగించారు. రెచ్చగొట్టాలనే దురుద్దేశ్యంతో ట్రాట్స్కీ-వాదులు యింకా పరిస్థితులు పరిపక్వం చెందని సమయంలో రైతాంగం యింకా సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు సిద్ధం కానిదశలో - ధనిక రైతువర్గాన్ని రద్దుచేయాలని ప్రతిపాదించారు. రైతులను సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు అనుకూలంగా తయారుచేసిన పక్షంలోనే కులక్‌వర్గాన్ని రద్దు చేయడానికి సాధ్యపడుతుంది.

బుఖారిన్‌వాద విద్రోహులుకూడా కార్మికవర్గంతో మిత్రత్వం అనే ముసుగు క్రింద పల్లెప్రాంతాలలో పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని అభివృద్ధి చేయాలనే ప్రతిపాదనలను చేశారు. పెద్దఎత్తున సమిష్టి వ్యవసాయక్షేత్రాలను నెలకొల్పడానికి అప్పటికే పరిస్థితులన్నీ పరిపక్వమయ్యాయి. దినదినాభివృద్ధి చెందుతున్న సోషలిస్టు పరిశ్రమలు పల్లెప్రాంతాలలో సమిష్టి వ్యవసాయోత్పత్తికి కావలసిన యంత్రాలను సరఫరాచేయగల స్థితిలోకి అప్పటికే వచ్చాయి. రైతాంగజనసామాన్యం సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరడానికి అప్పటికే సిద్ధపడింది. ఈరకంగా అన్నివిధాలా అనుకూల పరిస్థితులు కలసివచ్చిన సమయంలో బుఖారిన్ వాదులు సమిష్టి వ్యవసాయక్షేత్రాలనూ, కులక్‌లపై దాడిచేసే విధానాన్ని వ్యతిరేకించడానికి తయారయ్యారు.

అందువల్లనే ట్రాట్స్కీ వాదులనూ, బుఖారిన్ వాదులనూ నాశనం చేయనిదే బోల్షివిక్ పార్టీ కార్మికవర్గానికి శ్రామిక రైతాంగంతోగల మిత్రత్వాన్ని సంఘటితపరచుకొని, బలపరచుకోలేదు; దేశాన్ని సోషలిస్టు పద్ధతులపై పారిశ్రామికవంతం చేయలేదు; వ్యవసాయాన్ని సంఘపరం చేయలేదు; పెట్టుబడిదారీశక్తులకు వ్యతిరేకంగా సోషలిజం విజయానికి పరిస్థితులను సన్నద్ధం చేయలేదు.

పార్టీయొక్క లెనినిస్టు - స్టాలినిస్టు నాయకత్వంవల్లనే సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు విజయం సాధ్యమైంది. పెట్టుబడిదారులకు బంటులుగా తయారైన ట్రాట్స్కీలూ, జినోవీవ్‌లు, బుఖారిన్‌లూ, కామెనోవ్‌లతో జరిగిన పోరాటంలోనూ, లెనిన్ పరమపదించిన ఆ తరువాతనూ "స్టాలిన్ సంగ్రహ జీవితచరిత్ర" అనే గ్రంథంలో ఉదహరించినట్టు పార్టీలో నిజాయితీపరులంతా (కొబ్బరికాయలో టెంక కాక గుజ్జువలె) లెనిన్‌మహాశయుని మహత్తర పతాకాన్ని కాపాడారు. లెనిన్ ఆదేశించిన పవిత్రాశయం వెనుక పార్టీని సమీకరించి, సోవియట్ ప్రజలను పురోభివృద్ధికి గొనిపోయారు. దేశాన్ని పారిశ్రామికవంతం చేశారు. సమిష్టి వ్యవసాయక్షేత్రాలను ఏర్పరచి వ్యవసాయాన్ని సంఘపరంజేశారు.

కామ్రేడ్ స్టాలిన్ యీ 'గుజ్జుకూ', పార్టీలోని ప్రధానశక్తికీ, రాజ్యాంగ యంత్రానికి నాయకుడు. కామ్రేడ్‌స్టాలిన్ సారధ్యాన సోవియట్‌భూమి మహత్తరమైన శక్తిగానూ సోషలిజానికీ, ప్రజాస్వామికానికీ బ్రహ్మాండమైన దుర్గంగానూ తయారైంది.

బోల్షివిక్‌పార్టీ, దాని నాయకులైన లెనిన్, స్టాలిన్‌లూ సోవియట్ యూనియన్‌లోని శ్రామికప్రజలకు ఇతరదేశాలలోని శ్రామికులతోగల అంతర్జాతీయ సంబంధాలను పెంపొందించి, మరింత బలవత్తరం చేయడానికి శక్తివంచన లేకుండా కృషిచేశారు. సోషలిస్టుశక్తులు వృద్ధిపొంది, కేపిటలిజంపై సోషలిజం విజయంపొందాలంటే శ్రామికప్రజల అంతర్జాతీయసంఘటన అత్యవసరం.

> "సోవియట్ కార్మికవర్గం ప్రపంచ శ్రామికవర్గంలోఒకభాగం; దాని ప్రథమశ్రేణికూడా. ప్రపంచ శ్రామికవర్గానికి మన సోవియట్ రిపబ్లిక్ ముద్దుల బిడ్డ. పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం మన కార్మికవర్గాన్ని బలపరచి వుండకపోయినట్లయితే, మనం అధికారం నిలబెట్టుకోగలిగేవారం కాదు; సామ్యవాదనిర్మాణానికి అనుకూలమైన పరిస్థితులు లభ్యమయ్యేవికావు. కాబట్టి యిప్పుడు మనం సాధించినవిజయాలను సాధించగలిగివుండేవాళ్ళం కాదు సోవియట్ కార్మికులకూ, పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికులకూ మధ్య అంతర్జాతీయ సంబంధాలు; సోవియట్ కార్మికులకు అన్నిదేశాల కార్మికులకు మధ్య అన్యోన్య సౌభ్రాతృత్వమూ - యివీ మన సోవియట్ రిపబ్లిక్‌లశక్తికీ, బలానికీ మూలస్తంభాలు.
>
> — స్టాలిన్
>
> (ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం పుట 518)

* * * *

పరీక్షలో నిగ్గుతేరిన అంతర్జాతీయవాద పతాకం క్రింద లెనినిస్టు - స్టాలినిస్టు పాలసీని పునాదిగా చేసుకొని, బోల్షివిక్ పార్టీ సోవియట్ యూనియన్‌లోని ప్రజలందరినీ ఒకే ఒక స్నేహపూరితమైన కుటుంబంలోకి చేరదీసి, జాతీయ దురభిమానులనూ, జాతీయవాదులను పరిమార్చింది. ఈ జాతీయవాదులు "ఏకజాతీయ" పతాకం అనే ముసుగు క్రింద జాతిలోనేవున్న వర్గ వైరుధ్యాలను ఖాతరుచేయకుండా, జాతీయ బూర్జువావర్గంతో కార్మికవర్గం సరిపెట్టుకోవాలనే నినాదం తీసుకొని, ఆ విధంగా శ్రామిక ప్రజల వర్గ చైతన్యాన్ని మొద్దుపరచి వారిని జాతీయ బూర్జువా పలుకుబడికి ఆహుతి చేయడానికి ప్రయత్నించారు.

జాతీయవాదులు ఆవిధంగా వివిధ దేశాలలోని శ్రామికప్రజల సౌభ్రాతృత్వ సంఘటనాశక్తిని కొంచెపరచి, వివిధ ప్రజలమధ్య శత్రుత్వాన్ని రెచ్చగొట్టి, తిరిగి పెట్టుబడిదారీ విధానాన్ని పునఃప్రతిష్ఠ చేయడానికి తంటాలు పడ్డారు.

అందుకనే అన్నిరకాలకూ చెందిన జాతీయ డీవియేషనిస్టులను (పెడదోవలు పట్టే జాతీయవాదులు.) నాశనం చేయకుండా పార్టీ సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి అన్ని జాతుల శ్రామిక ప్రజల స్నేహపూరితమైన సహకారభావాన్ని సాధించలేదు. శ్రామిక ప్రజానీకంలో అంతర్జాతీయ దృష్టిని ప్రవేశపెట్టి వ్యాపింపజేయలేదు. వివిధ ప్రజల స్నేహపూరిత సంబంధాలను బలపరచి సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్‌ల మహత్తర యూనియన్‌ను సృష్టించలేదు. దేశాన్ని పారిశ్రామికవంతంచేసి, ఆ విధంగా పరిశ్రమలలోని పెట్టుబడిదారీ శక్తుల తుదముట్టించి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను స్థాపించి, ఆ విధంగా ధనిక రైతువర్గాన్ని (కులక్‌లను) అంతంచేసి బోల్షివిక్‌పార్టీ కార్మికవర్గానికి శ్రామిక రైతాంగంతోగల ఐక్యతను దృఢపరచి, మేధావివర్గం యొక్క సహకార భావాన్ని సంపాదించి సోవియట్ యూనియన్‌లోని ప్రజలమధ్య నిలకడగల మిత్రత్వాన్ని సాధించింది. ఈ ప్రాతిపదికపైననే సోవియట్ సమాజంలో నైతిక-రాజకీయ ఐక్యత అభివృద్ధి చెందింది.

దోపిడీవర్గాలూ, కొద్దిపాటి స్కేలుపై జరిగే వస్తూత్పత్తి విధానమూ, ఉన్నంతకాలమూ సమాజంలో తప్పనిసరిగా తీవ్ర వర్గవైరుధ్యాలుంటాయి. ఇక వాటితోపాటు జాతుల వైరుధ్యాలుకూడా వుంటాయి. ఎందువల్లనంటే పెట్టుబడిదారీ శక్తులు జాతీయ దురభిమాన ధోరణులను రెచ్చగొట్టుతారు. జాతులమధ్య పూర్వం వున్న శత్రుత్వాలను బయటకు తీస్తారు. ఆవిధంగా జాతివైషమ్యాలను పెంచుతారు. దోపిడీవర్గాలను తుదముట్టించి - దోపిడికీ, నిర్బంధాలకు అవకాశమిచ్చిన కారణాలను అంతం జేయడం మూలంగా సోవియట్ సమాజంలోని పరస్పర విరుద్ధసంఘర్షణలన్నీ సర్వనాశనమయ్యాయి. కార్మికవర్గానికి రైతాంగానికి వున్న తారతమ్యమూ, ఈవర్గాలకూ మేధావి వర్గానికీ వున్న తారతమ్యాలను రోజురోజుకు తగ్గించి వేయడం మూలంగా యీ సాంఘికశక్తులన్నీ నేడు దగ్గర దగ్గరకు వస్తున్నాయి.

సోవియట్‌రాజ్యం సాధించిన విజయాలను గురించి వివరించుతూ 18వ పార్టీ మహాసభలో తాను సమర్పించిన నివేదికలో కామ్రేడ్ స్టాలిన్ యిలా ఉద్ఘాటించాడు:

"మనమిప్పుడు సమీక్షచేస్తున్నదశలో, మనదేశం సాంఘిక, రాజకీయ రంగాలలో ఎంతో అభివృద్ధిచెందింది. ముఖ్యంగా చెప్పుకోదగిన ప్రధానమైన విజయమేమంటే: ఇంకా మిగిలిపోయివున్న దోపిడీవర్గశక్తులు సంపూర్ణంగా మటుమాయం చేయబడ్డాయి. కార్మికులు, కర్షకులు, మేధావులూ ఒకే ఒక శ్రామికప్రజాసంఘటనగా ఐక్యంచేయబడ్డారు. సోవియట్ సమాజంయొక్క నైతికరాజకీయ ఐక్యత మరింత బలపడింది. మనదేశంలో వివిధదేశాల మధ్య స్నేహసౌభ్రాతృత్వ సంబంధాలు మరింత దృఢపడ్డాయి. వీటన్నింటి ఫలితంగా మనదేశంలోని రాజకీయ జీవితం పరిపూర్ణంగా ప్రజాతంత్రం చేయబడి, నూతన రాజ్యాంగచట్టాన్ని నిర్మించుకొన్నాం."

—ప్రోబ్లమ్స్ఆఫ్ లెనినిజం పుట 607.

పట్టణాలలోనూ, పల్లెలలోనూ పెట్టుబడిదారీ శక్తులు అంతమొందిన తరువాత, దేశంలో అంతరంగికంగావున్న పరస్పర వైరుధ్యాలకు స్వస్తిచెప్పబడినతరువాత వర్గ పోరాట తీవ్రత యింక పూర్తిగా అంతర్జాతీయ రంగానికి మరలింది. మనసైన్యం శిక్షణాసంస్థలూ, మిలిటరీశాఖను కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు దేశంలో వున్నవారిపై గాక బయట,- విదేశశత్రువులకు వ్యతిరేకంగా తమ దృష్టిని కేంద్రీకరించవలసివచ్చింది.

ఇక స్వదేశంలో పెట్టుబడిదారీ విధానం విడిచిపెట్టి వెళ్ళిన కొన్నిశక్తులకు వ్యతిరేకంగా పోరాడే సందర్భంలో సాంఘిక జీవితంలో ప్రజలకు పెద్దగా చైతన్యం లేకపోవడం మూలంగా వెంటనే వదలని పాతకాలపు అలవాట్లనూ, సాంప్రదాయా లనూ పోగొట్టడానికి శక్తినంతటినీ కేంద్రీకరించడం జరుగుతున్నది. సోషలిస్టు సమాజ నిర్మాణ బాధ్యతకు అడ్డుతగిలే "పెట్టుబడిదారీ విధానపు పుట్టుమచ్చలకు" వాటి వార సత్వానికీ వ్యతిరేకం జరిగేపోరాటమిది.

పెట్టుబడిదారీవిధాన అవశేషాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటం చాలావరకు మనయెడల విరోధవైఖరిని కలిగివుండే కేపిటలిస్టు ప్రపంచంతో ఎక్కువ సంబంధించి వుంది. ఎందువల్లనంటే సామ్రాజ్యవాదులు పెట్టుబడిదారీవర్గ అవశేషాలను-ముఖ్యంగా బూర్జువావర్గ సంస్కృతిముందు లొంగిపోవడం, వ్యక్తిగత ప్రయివేటు ఆస్తిని సంపా దించుకొందామనే ధోరణి వుండటం, జాతీయ దురభిమానాలను కలిగిఉండటం, మత పిచ్చిని కలిగివుండటం, రాజకీయ స్వభావం లేనితనమూ, శత్రువర్గ చేతులలో పడి పోవడం - మొదలైనవాటిని రెచ్చగొట్టడానికి తమ యావత్ శక్తిని వినియోగించడానికి ప్రయత్నిస్తున్నారు.

నేను విమర్శన ఆత్మవిమర్శన చేసుకొనేపద్ధతితో అభివృద్ధి చెందుతున్న పాత కొత్తలమధ్య సంఘర్షణా, పెట్టుబడిదారీవిధానపు అవశేషాలకు వ్యతిరేకంగా జరుగు తున్న పోరాటమూ మొత్తం సోషలిజంకోసం పెట్టుబడిదారీ ప్రపంచానికి వ్యతిరే కంగా జరిగే పోరాటంలో ఒక భాగం మాత్రమే.

* * * *

పెట్టుబడిదారీ బానిసత్వాన్నుండి విముక్తిచెంది, సోషలిజం విజయానికి, పురోగ మించే అన్నిదేశాలలోని శ్రామిక ప్రజల మార్గాన్ని మార్క్సిస్టు - లెనినిస్టు వర్గపోరాట

సిద్ధాంతం తన కాంతులలో సుగమంచేస్తుంది. సోషలిస్టు విప్లవానికున్న జనరల్ సూత్రాలను ఆధారం చేసుకొని, వ్యక్తిగత దేశాలు సోషలిజానికి పురోగమించడానికి ప్రత్యేక రూపాలు (పద్ధతులు) వుండవచ్చు. కాని యీ ప్రత్యేక రూపాలు మార్క్సిజం యొక్క ప్రధాన సూత్రాలైన వర్గాలూ, వర్గపోరాట సిద్ధాంతాన్ని ఏ విధంగానూ కొంచెపరచరాదు. పెట్టుబడిదారీ విధానాన్ని ధ్వంసంచేసి, సోషలిజం స్థాపించడానికి జరిగే పోరాటంలో కార్మికవర్గానికి దానిపార్టీకిగల నాయకత్వ పాత్రను ఏవిధంగాను కొంచపరచరాదు.

పెట్టుబడిదారీవిధానం నేడు తీవ్రమైన సంక్షోభంలో పడి సతమతమవుతోంది. మరోప్రక్క సోషలిస్టుశక్తులు క్రమేణా అభివృద్ధి చెందుతున్నాయి. ఈవిధమైన నేటి పరిస్థితులలో ప్రజాస్వామిక, సోషలిస్టు ఉద్యమం వృద్ధిపొందుతున్నది. గుత్తపెట్టుబడి దారీవిధాన ఆధిపత్యం నానాటికి ఆధునిక కేపిటలిజాన్ని క్షీణింపజేస్తున్నది. ప్రజాసామాన్యపు దారిద్ర్యాన్ని విపరీతంగా పెంచుతున్నది. ఇదంతా పెట్టుబడిదారీ బానిసత్వానికి వ్యతిరేకంగా శ్రామికుల వర్గపోరాటం క్రమేణా మరింత తీవ్రమవడానికి కారణ మవుతున్నది.

పెట్టుబడిదారీ దేశాలు అసమానంగానూ, ప్రమాద భరితంగానూ అభివృద్ధి చెందడం మూలంగా పెట్టుబడిదారీవిధానంలో ఎన్నడూలేనంత తీవ్రధోరణిలో వైరుధ్యాలు ప్రత్యక్షమై మరొక నూతనయుద్ధానికి దారితీశాయి. దానిఫలితంగా సామ్రాజ్యవాదశిబిరం మరింతబలహీనపడిపోయింది ప్రథమ ప్రపంచయుద్ధఫలితంగా మొట్టమొదటి సారిగా సోషలిజానికి జయప్రదంగా పురోగమించిన ప్రథమదేశం - సోవియట్ రష్యా సామ్రాజ్యవాద విధానాన్నుండి బయటపడితే రెండో ప్రపంచయుద్ధఫలితంగా మరికొన్ని కొత్తదేశాలు ప్రజాస్వామిక ప్రజాతంత్రాన్ని నిర్మించుకొని సామ్రాజ్యవాద విధానాన్నుండి బయటపడ్డాయి.

సోషలిస్టు, ప్రజాస్వామికశక్తులు క్రమేణా వృద్ధిఅవుతూ బలపడుతున్నాయి. నేడవి కేపిటలిస్టు, అభివృద్ధి నిరోధకశక్తులకంటే చాల బలవత్తరంగా ఉన్నాయి. ప్రతిచోటా కార్మికవర్గం పెట్టుబడిదారీ బానిసత్వానికీ, వలసదేశ విధానానికీ వ్యతిరేకంగానూ, నూతనయుద్ధాన్ని రెచ్చగొట్టే సామ్రాజ్యవాద ఏజెంట్లకు వ్యతిరేకంగా జరిగేపోరాటాలకు నాయకత్వం వహించి నడుపుతున్నది. ఇందుకోసం తన చుట్టూ శ్రామికవర్గేతర జనసామాన్యాన్ని సమీకరించుతోంది.

శ్రామికప్రజల యీ విముక్తి పోరాటానికి ప్రపంచంలోని ప్రథమసోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్ అభివృద్ధిచెంది బలపడటం చాల ముఖ్యమైనవిషయం. పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామికప్రజల విముక్తిపోరాటంలో సోవియట్ రాజ్యం యొక్క పాత్రనుగురించి వివరించుతూ కామ్రేడ్ స్టాలిన్ మొట్టమొదట విజయం పొందినదేశంలో సోషలిజం ఎంతబాగా బలపడివుంటే అంత తొందరగా అంత తేలికగా కొత్తదేశాలు సామ్రాజ్యవాద పరిధినుండి బయటపడి పోవడానికి అవకాశం లభిస్తుందని తెలియజేశాడు. ప్రథమదేశంలో సోషలిజం ఎంత పఖడబందీగా బలపడితే అంత

త్వరత్వరగా యీదేశం ప్రపంచవిప్లవ సాధనానికి అనువైన కేంద్రంగా తయారవుతుంది ఇంకా సామ్రాజ్యవాదం విచ్ఛిన్నం కావడానికిమరింత సాధనంగా వినియోగ పడుతుం దని కామ్రేడ్ స్టాలిన్ స్పష్టపరచాడు.

— కలెక్టడ్‌వర్క్సు 6 వ సంపుటి 399 పేజీ

పెట్టుబడిదారీవిధానానికి వ్యతిరేకంగా పోరాడుతున్న సోషలిస్టు దేశాలలోని శ్రామికప్రజలు అన్ని దేశాలలోని శ్రామికప్రజల అంతర్జాతీయ ఐక్యతాసంఘటనపై ఆధారపడతారు. అంతేకాదు;సోవియట్ యూనియన్ సోషలిజానికిప్రధానరక్షణదుర్గం.

అక్టోబరు సోషలిస్టు విప్లవానికిముందే లెనిన్ వివిధ దేశాలు సోషలిజానికి పరి వర్తనచెందే ప్రత్యేక స్వభావాన్ని చూడగలిగాడు. ఒక పెద్దదేశంలో సోషలిస్టు విప్లవం విజయం పొందిన తరువాత ఇరుగు పొరుగునున్న చిన్న దేశాలలోని కార్మికవర్గా నికి బూర్జువా ప్రభుత్వం బలహీనంగా వున్నదన్నప్పుడు దానిని కూలద్రోయడం చాలా తేలికైన విషయమనీ, ఈ విధంగా జరగడానికి అవకాశమున్నదని ప్రత్యేకకారణంగా లెనిన్ ఉదహరించాడు.

ఈ సందర్భంలో 1916 లోనే లెనిన్ యిలా చెప్పాడు :

"ఒకానొక బూర్జువాను అధికారాన్నుండి కూలద్రోసి దాని విప్లవ ప్రతీ ఘాత దాడులను తట్టుకొని, దెబ్బతీయడానికి ఖచ్చితమైన ఒకేఒక విప్లవవర్గంగా శ్రామికవర్గ నియంతృత్వం తప్పనిసరిగా అవసరం. శ్రామికవర్గ నియంతృత్వం ఎంత అతి ముఖ్యమైన సమస్య అంటే దానిని కాదనేవ్యక్తిగాని లేక మాటలలో మాత్రమే గుర్తించే వ్యక్తిగానీ * సోషల్ డెమోక్రటిక్‌పార్టీలో సభ్యుడుగా వుండటానికి అర్హుడుకాదు. కాని ఒక విషయాన్ని మాత్రం కాదనడానికి వీలు లేదు. అదేమంటే కొన్ని వ్యక్తిగత దేశాల విషయంలో ప్రత్యేక కారణంగా ఉదాహారణకు ఒక చిన్న దేశంలో దాని పొరుగుదేశం అప్పటికే సోషలిస్టు విప్లవం పూర్తిచేసి ఉండివున్న పక్షంలో అక్కడ బూర్జువావర్గం యింకా ప్రతి ఘటించి లాభంలేదని, తన దేహం చెడకుండా కాపాడదలచుకుంటే -ఆ బూర్జువా అధికారాన్ని శాంతియుతంగా కూలద్రోయడానికి వీలవుతుంది."

— కలెక్టడ్‌వర్క్సు. సంపుటి 19 పుట 229

అంతేకాదు, వర్గపోరాటం లేనిదే సోషలిజాన్ని సాధించడం అసాధ్యమనీ, ప్రతిఘటన లేకుండా దోపిడీదారులు రంగంలోనుండి విరమించరనీ, అందువలన మార్క్సిస్టుపార్టీకి వర్గపోరాటమొక్కటే నమ్మకమైన కార్యక్రమమనీ లెనిన్ మహా శయుడు హెచ్చరించాడు.

లెనిన్ చెప్పిన యీ జోస్యంలో చిన్న దేశాలలో సోషలిజం అభివృద్ధి చెందా లంటే పొరుగుననున్న ఒక పెద్ద దేశంలో సోషలిజం విజయం పొందివుండాలన్న విష

* ఆ రోజులలో కమ్యూనిస్టుపార్టీని సోషల్ డెమోక్రటిక్‌పార్టీ అనే పేరు తోనే వ్యవహరించేవారు — అనువాదకుడు.

యానికి అత్యధిక ప్రాముఖ్యత యివ్వబడింది. లెనిన్ ప్రకటన సారాంశంనుండి తేలేదే మంటే యీ దేశాలూ, సోషలిజం వైపునకు పురోగమించే ప్రత్యేక స్వభావంగల రూపాలు సోషలిస్టు విప్లవంయొక్క సాధారణ సూత్రాలను ఆధారం చేసికొనివుండి తీరాలి. అంతేకాక పొరుగునున్న పెద్దదేశంలో యీసూత్రం అప్పటికే ప్రజాజీవితంలో పూర్తిగా అమలు పెట్టబడి వుండాలి. అందుకనే చిన్న దేశాలు సోషలిజం వైపు పురోగమించే విషయంలో ప్రత్యేక స్వభావంగల రూపం అన్నప్పుడు ఆ రూపాలు మార్క్సిస్టు విప్లవ సిద్ధాంతాన్నుండి వేరుపడిగాక ఖచ్చితంగా ఆ సిద్ధాంతంపైననే ఆధారపడి వుండాలి.

కాబట్టి ఏ దేశంలోనైనా సోషలిజం ఒక ప్రత్యేక స్వభావంగల రూపంలో ఏర్పాడడాన్ని సోషలిస్టు శక్తులు అభివృద్ధిచెందే సాధారణ సూత్రాల ననుసరించిగాక ఏదో ఒక ప్రత్యేక ఉపజ్ఞతోకూడా జాతీయ పంథా అని భావించడమంటే అది మార్క్సిజాన్నుండి విడిపోయి, జాతీయవాదం స్వీకరించడ మవుతుంది.

మధ్య, ఆగ్నేయ యూరప్ దేశాల పొరుగునే మహత్తరమైన సోషలిస్టు రాజ్యం ఉండటం మూలంగా ఆదేశాలలోని ప్రజలు పెట్టుబడిదారీ, భూస్వాముల అధికారానికి వ్యతిరేకంగా పోరాడి ప్రజల అధికారాన్ని స్థాపించడానికి బాగా వీలుపడింది.

బ్రిటిష్, అమెరికన్ సైన్యాలు ఆక్రమించుకొన్న దేశాలలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆదేశాలలోని అభివృద్ధి నిరోధక 'శక్తు'లను బలపరచుతూ, జనసామాన్యం ప్రజాతంత్ర వ్యవస్థను నిర్మించుకోడానికి అడ్డుతగిలారు. అదే సమయంలో సోవియట్ యూనియన్ హిట్లర్ జర్మనీని, దాని మిత్రులను ఓడించి మధ్య, ఆగ్నేయయూరప్ దేశాల ప్రజలను దురాక్రమణదారులనుండి విముక్తిచేసింది. అంతేకాక విముక్తిచెందిన ప్రజలను తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొనేందుకు అవకాశం కలుగజేసింది. వారు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానంకోసం పోరాడటానికీ, సోషలిస్టు పంథాలో అభివృద్ధిచెందడానికీ, సహాయపడింది.

ఈదేశాలలోని పాత ప్రజా-వ్యతిరేక ప్రభుత్వాలు ప్రజలనుండి పూర్తిగా దూరమయ్యాయనే విషయం అందరికీతెలిసిన విషయమే. బూర్జువా - భూస్వామిక పైతరగతి పాలకవర్గాలు తామనుసరించిన అభివృద్ధి నిరోధక స్వదేశ, విదేశాంగ విధానాల మూలకంగా యుద్ధానికి పూర్వదశలోనే తమ దేశాలను ప్రమాదపరిస్థితులలో పడవేశారు. ఇక యుద్ధకాలంలో వారు ఫాసిస్టు ఆక్రమణదారులతో ఏకమయ్యారు. అందువల్ల జర్మన్ ఫాసిస్టు బానిసత్వానికి వ్యతిరేకంగా జరిగిన ప్రజల పోరాటం తప్పనిసరిగా తమదేశాలలో అంతకుముందున్న పాలకవర్గాలకూ, శిధిలావస్థలో వున్నవారి అభివృద్ధి నిరోధక రాజకీయపరిపాలనకూ వ్యతిరేకపోరాటమైంది.

ఈదేశాలలో అంతకుముందు రాజ్యాధికారాన్ని చెలాయిస్తున్న వర్గాలు ప్రజల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోయారు. అందువలన అవి శ్రామిక జనబాహుళ్య సహాయంపై ఆధారపడలేకపోయాయి. ప్రజలచేత ద్వేషించబడిన యీ దోపిడీవర్గాలు తమ దేశాలలోని ప్రజలనుండి పూర్తిగా వేరుపడిపోయి, బయటనుండికూడా సహా

యాన్ని తెచ్చుకోలేకపోయారు. ఎందువల్లనంటే హిట్లర్ జర్మనీని సంపూర్ణంగా ఓడించిన సోవియట్ సైన్యాలు అక్కడుండి సామ్రాజ్యవాద ప్రభుత్వాల మిలిటరీ దాడులనుండి నూతన ప్రజాతంత్ర రాజ్యాల భద్రతను గ్యారంటీచేశాయి.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలప్రక్కనే సోవియట్ యూనియన్ వుండి వుండకపోతే ఈ దేశాలలోని సోషలిస్టు ప్రజాస్వామికశక్తులను అణచివేయడానికి సామ్రాజ్యవాదరాజ్యాలు సాయుధ జోక్యం కలుగజేసుకొని ఉండేడివే. సామ్రాజ్య వాదులు యితరదేశాల వ్యవహారాలలో అనవసరంగా జోక్యం కలిగించుకొని, ఆదేశాలలోని ఆంతరంగిక అభివృద్ధి నిరోధక ముఠాలతో ఏకమై, మిలిటరీ బలంద్వారా ప్రజల అభీష్టానికి విరుద్ధంగా వారిపై భయంకర ఎలా భీభత్సకచర్యలుజరిపి వారిపై అభివృద్ధినిరోధక టెర్రరిస్టుదుష్టపరిపాలనను ఎలారుద్దుతారో గ్రీస్ దేశంచక్కని ఉదాహరణ.

నూతన ప్రజాతంత్ర రాజ్యాలు మహత్తరమైన సోవియట్ యూనియన్ సహాయఫలితంగానూ, ప్రపంచమంతటా వృద్ధిచెందుతున్న ప్రజాస్వామిక, సోషలిస్టు శక్తుల మూలంగానూ యీ భయంకరబాధలను తప్పించుకోగలిగాయి.

మహత్తరమైన సోషలిస్టురాజ్యం మూలంగానూ, ప్రపంచమంతటా వృద్ధిచెందుతున్న సోషలిస్టుశక్తుల మూలంగానూ నూతన ప్రజాతంత్ర రాజ్యాలు అభివృద్ధి చెందినవనే అతిముఖ్యమైన విషయాన్ని యుగోస్లోవియా నాయకులు తమ దురభిమాన ఫలితంగా అర్థంచేసుకోలేకపోయారు. యుగోస్లోవియా నాయకులు ఫాసిస్టు దురాక్రమణనుండి తమ దేశాన్ని తమంతటతామే స్వయంగా విముక్తిపరచామని తలుస్తున్నారు. యుగోస్లోవియా నాయకులు ఇతరదేశాల కమ్యూనిస్టుపార్టీల సహాయంలేకుండా యితర ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల సహాయంలేకుండా, సోవియట్ యూనియన్ సహాయంలేకుండా, సామ్రాజ్యవాద రాజ్యాల దాడులనుండి తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలమని భావిస్తున్నారు. సంయుక్త సామ్రాజ్యవాద ప్రతికూల సోషలిస్టు సంఘటననుండి వేరుపడిపోయిన యుగోస్లోవియా సామ్రాజ్యవాద దేశాల వలసరాజ్యంగా మారిపోదని, జాతీయవాద ఊబిలో బాగాయిరుక్కొని పోయినవారు మాత్రమే ఆవిధంగా వూహించగలుగుతారు.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలలో కార్మికవర్గం కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన ప్రజాతంత్ర పునర్నిర్మాణంకోసం జరిగిన పోరాటంలో ప్రధాన పాత్రను నిర్వహించాయి. అయితే ఈరాజ్యాలలో కార్మికవర్గానికి నాయకత్వ స్థానం దానంతటదే ఒక్కసారిగా రాలేదు. విప్లవపోరాటంలో కార్మికవర్గం అధికారాన్నుండి ఒక బూర్జువా ముఠా తరువాత మరొక బూర్జువా ముఠాను కూలద్రోయవలసి వచ్చింది.

బూర్జువా పార్టీలు చాల పట్టుదలతో అధికారాన్ని తమ గుప్పెటలో పెట్టుకొని తిప్పవేశాయి. కార్మికవర్గ జనసామాన్యం వొత్తిడివలననూ శ్రామిక రైతాంగంలోని ప్రధానభాగం వొత్తిడి మూలకంగానూ అవి ఒక స్థానంనుండి మరొక స్థానం క్రమంగా విడిచిపెట్టవలసి వచ్చింది. ఈ విధంగా కార్మికవర్గ కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన శ్రామిక రైతాంగంలోని అధికభాగాన్ని తనవైపుకు త్రిప్పుకొని క్రమక్రమంగా అధికారాన్ని బూర్జువా వర్గాన్నుండి గుంజుకో గలిగింది.

కార్మికవర్గంయొక్క నాయకత్వపాత్ర లేనికే ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలను ప్రజాతంత్ర పునర్నిర్మాణంకోసం తాము జరిపే పోరాటంలో కార్మికులను, రైతులను సమానమైన ఒకే అడుగుమీద పెట్టడం సాధ్యంకాదనే ప్రాథమిక మార్క్సిస్టు సత్యాన్ని యుగోస్లావియా నాయకులు మరచిపోయారు. కార్మికవర్గ నాయకత్వపాత్రను నిరాకరించి, యుగోస్లావియా నాయకులు నరోడ్నిక్ - కులక్‌పార్టీ స్థితికి దిగజారిపోయారు.

రాజ్యాంగయంత్రంలో కార్మికవర్గానికి నాయకత్వపాత్ర లేకుండా సోషలిస్టు పునర్నిర్మాణ కార్యక్రమానికి శ్రామిక రైతుజనసామాన్యాన్ని సమీకరించడం అసాధ్యమైనపని. అంతేకాదు, నూతన ప్రజాతంత్ర రాజ్యాలలో శ్రామికవర్గ నాయకత్వపాత్ర లేకుండా భారీ పరిశ్రమలను జాతిపరం చేయడంకాని, జాతీయ ఆర్థిక విధానంలో సోషలిస్టు సూత్రాలను ప్రవేశపెట్టడంకాని సాధనమై ఉండేదికాదు. పరిశ్రమలను జాతిపరం చేసిన సందర్భంలో బూర్జువాపార్టీలనుండి విపరీతమైన వొత్తిడి వచ్చినదనే విషయం అందరికీ తెలిసినదే.

బడా పరిశ్రమలూ, మధ్యతరగతి పరిశ్రమలూ జాతిపరం చేయడం దీర్ఘకాలం పట్టింది. అదీ అనేక పద్ధతులలో జరుగవలసివచ్చింది. కార్మికవర్గపార్టీయైన కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే ప్రధాన ఉత్పత్తిసాధనాలన్నింటినీ జాతిపరంచేయాలని ఖచ్చితంగా ముందుకొచ్చి పోరాడింది.

కార్మికవర్గ నాయకత్వపాత్రలేకుండా వుండి వున్నట్లయితే నూతన ప్రజాతంత్ర దేశాలలోని విముక్తి పోరాటం బూర్జువా ప్రజాతంత్ర విప్లవంతో ఆగిపోయివుండేది. అంతేకాక దేశం సోషలిస్టుపంథావైపుకు పురోగమించడానికి తగినపరిస్థితులు సృష్టించబడివుండేవికాదు. భూస్వామికవిధానం (ఫ్యూడలిజం) మాత్రమే రద్దుచేయబడి పెట్టుబడిదారీవిధానం వృద్ధిచెందేది. అంతకంటే అధికం ఏమాత్రం జరిగివుండేదికాదు.

నూతన ప్రజాతంత్రరాజ్యాలు సోషలిస్టుపంథాలో అభివృద్ధిచెందడానికి సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికీ శ్రామికరైతాంగాన్ని సమీకరించడానికి కార్మికవర్గం ఒక్కటే ప్రధానశక్తిగా కృషిచేస్తుంది. కార్మికవర్గం లేకుండా రైతులు పెట్టుబడిదారీ బానిసత్వాన్ని త్రోసివైచి, సోషలిస్టుపంథాను చేబట్టలేరు.

అందువలన కార్మికవర్గ నాయకత్వ పాత్రను బాగా బలపరచుకొంటేనే ప్రజారిపబ్లికన్ రాజ్యం దృఢంగా అధికారంలో వుండగలదనే గ్యారంటీ వుంది. అప్పుడే దేశంలో సోషలిజాన్ని జయప్రదంగా నిర్మించుకోడానికి వీలవుతుంది.

కార్మికవర్గ పార్టీకీ పార్టీయేతర ప్రజాసంస్థలతో వుండవలసిన పరస్పరసంబంధాలనుగురించి మార్క్సిస్టు ఉపదేశాలను యుగోస్లావియా నాయకులు వక్రమార్గంలో పెట్టారు. కమ్యూనిస్టుపార్టీల సమాచారశాఖ తీర్మానంలో ఉదహరించినట్లుగా యుగోస్లావియాలో వారు కమ్యూనిస్టుపార్టీనిగాక ప్రజాసంఘటన సంస్థనే (పీపుల్స్‌ఫ్రంట్) ప్రధానశక్తిగా భావించడం ప్రారంభించారు. కమ్యూనిస్టుపార్టీకి వేరే ప్రత్యేక

కార్యక్రమం ఉండరాదనీ, ప్రజాతంత్ర సంఘటన సంస్థ కార్యక్రమంతో తృప్తిపడాలని యుగోస్లోవియా నాయకులు వాదించారు.

ఇవన్నీ యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినంతవరకూ, 'లిక్విడేషనిస్టు' ధోరణులకు దారితీశాయి. పార్టీని రద్దుచేసి, దానిస్థానే పార్టీయేతర ప్రజాసంస్థను నిర్మించాలనే మెన్షవిక్ సిద్ధాంతాలు యిందులో తిరిగి ప్రదర్శితమయ్యాయి. కమ్యూనిస్టు పార్టీ యితర దేశాల కమ్యూనిస్టుపార్టీల సహకారంతో సోషలిస్టు సమాజ నిర్మాణానికి పోరాడాలని యుగోస్లోవియా నాయకులు వాంఛించడం మాని, ఆ పని జాతీయవాదుల ఆజ్ఞలను గ్రుడ్డిగా శిరసావహించే ఒక జాతీయ సంస్థ చేయాలని కోరుతున్నారు.

నూతన ప్రజాతంత్రదేశాలు సాధించిన విజయాలు తప్పనిసరిగా కమ్యూనిస్టు పార్టీల అభివృద్ధిపైనా, బలంపైననే ఆధారపడి ఉంటాయి. కమ్యూనిస్టుపార్టీలు కార్మికవర్గానికి రాజ్యాంగయంత్రంలో నాయకత్వ పాత్ర ఉండేటట్లుచేసి, ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు సోషలిస్టు పద్ధతులతో అభివృద్ధిచెందేటట్లు చేస్తాయి. ఈ సందర్భంలో కమ్యూనిస్టుపార్టీలు కార్మికవర్గరాజకీయ, నిర్మాణఐక్యత కోసం పోరాడటం అత్యంత ముఖ్యావసరం.

మధ్య, ఆగ్నేయయూరప్ దేశాలలోనూ, యింకా యితరదేశాలలోనూ మితవాద సోషలిస్టుల విద్రోహపాలసీ ఫలితంగా కార్మికవర్గంలో చాలకాలంగా చీలికలు ఉండిపోయినాయి. దాని మూలంగా కార్మికవర్గశక్తులు బలహీనపడి శక్తివిహీనమయ్యాయి. నూతన ప్రజాతంత్రరాజ్యాలలో కార్మికవర్గాన్ని రాజకీయంగానూ, నిర్మాణరీత్యాను ఐక్యం చేయడానికి తీవ్రకృషి జరిగింది.

ఈ సందర్భంలో అప్పుడే పెద్దపెద్ద విజయాలనుసాధించడంకూడా జరిగింది. రుమేనియా, హంగెరీ, చెకోస్లోవేకియాలలో కమ్యూనిస్టు, సోషలిస్టుపార్టీలు మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంత పాలసీలను ఆధారంచేసుకొని ఒకేపార్టీగా ఐక్యమయ్యాయి. పోలండులో కార్మికవర్గపార్టీలను ఐక్యపరచి, ఒకేపార్టీగా నిర్మించడానికి ప్రయత్నాలుజరుగుతున్నాయి. (పోలండులోకూడా ఆ తరువాత ఒక ఐక్యపార్టీ ఏర్పడింది. —అనువాదకుడు)

దీనివలన కార్మికవర్గంలో నిర్మాణరీత్యా, రాజకీయరీత్యా వున్న చీలికలు రద్దయినాయి. దానితో కార్మికవర్గ ఐక్యత సంఘటితపడి, రాజ్యాంగ యంత్రంలో దాని నాయకత్వ పాత్ర బలపడుతుంది. మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలను పునాదిగా చేసుకొని కమ్యూనిస్టు, సోషలిస్టుపార్టీలు ఏకమవడంతో కార్మికవర్గంలోని అవకాశవాదానికి ఓటమి జరిగింది. సోషల్ డెమోక్రసి దివాళాకోరుతనానికి, లెనినిజం విజయానికి యిదొక నూతనతార్కాణం.

ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు మార్క్సిస్టు వర్గపోరాట సూత్రాలననుసరించే సోషలిజానికి పురోగమించుతున్నాయి. పెట్టుబడిదారీ విధానపు ఆస్తి సంబంధాలను త్రెంచివేయడంద్వారా దోపిడీవర్గాల ప్రతిఘటన అణచివేయబడుతున్నది. రాజకీయాధికారాన్ని పోగొట్టుకొన్న దోపిడీవర్గాలు ప్రజాప్రభుత్వాన్ని కూలద్రోసి, గ్రామి ప్రజల ప్రజాతంత్ర విజయాలను తుదముట్టించాలని అన్నివిధాలా తంటాలు ప

తున్నాయి. అంతేకాదు; ఈ ప్రయత్నాలను పెట్టుబడిదారీదేశాలలోని అభివృద్ధి నిరోధకశక్తులు ప్రోత్సహించి, బలపరుస్తున్నాయి.

అభివృద్ధినిరోధకశక్తులు ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థలను నాశనం చేయడానికి విధ్వంసక చర్యలు, కుట్రలు, టెర్రరిస్టు చర్యలూ మొదలుగాగల అన్ని తప్పుడు కార్యక్రమాలకూ దిగారు. కాబట్టి ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు సోషలిజానికి అభివృద్ధిచెందాలంటే పరస్పర విరుద్ధమైన యీ వర్గపోరాటాలు సమసిపోయేబదులు తప్పనిసరి అవుతాయి. శ్రామికవర్గమూ, దానిమిత్రులూ దోపిడివర్గాలకూ ప్రజా రిపబ్లిక్ శత్రువులకూ వ్యతిరేకంగా ఎడతెగని పోరాటాన్ని జరుపవలసి ఉంటుంది.

కాని మార్క్సిస్టు వర్గపోరాట సిద్ధాంతానికి తిలోదకాలిచ్చిన యుగోస్లోవియా నాయకులు కేపిటలిజాన్నుండి సోషలిజానికి పరివర్తనచెందే దశలో వర్గ పోరాటం మరింత తీవ్రమవుతుందనే సత్యాన్ని నిరాకరించారు. పైగా ఆ పరివర్తన దశలో వర్గ పోరాటం తీవ్రత చెందదనీ, మెల్లమెల్లగా వర్గ పోరాటమే సమసిపోతుందనే అవకాశవాదాన్ని పునాదిగా తీసుకొన్నారు.

నూతన ప్రజాతంత్ర రాజ్యాలలో దోపిడీ వర్గ శక్తులనూ, ఒక మనిషి మరొక మనిషిని పీడించుకొనితినే విధానాన్ని రద్దు చేయడం పైననే సోషలిజం అభివృద్ధి చెందుతుంది. దోపిడీవర్గాలు అలాగే వున్నంతకాలమూ, వాటికి ఆర్థిక పునాదులుండి, స్వంతంగా ఆస్తిలేక తమపై ఆధారపడే జనసామాన్యంపై వారు వొత్తిడి చేయగలిగినంత కాలమూ, వారు పేద ప్రజల ప్రజాతంత్ర హక్కులను ఆచరణలో పూర్తిగా అణచి వేయ గలుగుతారు.

దోపిడీవర్గాల నన్నింటినీ రద్దుచేసిన పక్షంలోనే - ఇతరుల శ్రమశక్తిని దోచుకొని జీవించే శక్తులు యిక లేనప్పుడే - పెట్టుబడిదారుని ముందూ, ధనికరైతుముందు, వర్తకునిముందూ, వడ్డీవ్యాపారిముందు పత్పనిసరిగా లొంగిపోవలసిన గతి పట్టిన పీడితులు యిక లేనప్పుడే - ప్రజాస్వామిక ప్రజాతంత్రం ఖచ్చితమైన సోషలిస్టు ప్రజాస్వామిక వ్యవస్థగా అభివృద్ధిచెందుతుంది.

ప్రజాధికారాన్నీ, రాజ్యాంగయంత్రంలో కార్మికవర్గనాయకత్వపాత్రనూ అత్యధిక మెజారిటీ ప్రజానీకం బలపరచినప్పుడే దేశం సోషలిజానికి జయప్రదంగా పురోగమించడానికి సాధ్యపడుతుంది. ఇది సాధ్యపడాలంటే శ్రామికవర్గేతర కష్టజీవులంతా కార్మికవర్గ దృక్పథమైన సోషలిజాన్ని సంపూర్తిగా అంగీకరించి తీరాలి. నూతన ప్రజాతంత్ర దేశాలలో కష్టజీవిగావున్న రైతుకూ, ఆస్తియజమానిగా వున్న రైతుకూ ఆర్థికరంగంలో పరస్పర విరుద్ధ ప్రయోజనాలున్నాయి. రైతాంగంలో వున్న యీ ద్వందవిధానం యింకా తొలగిపోలేదు. కూలీలుగా వున్న రైతులు శ్రామికవర్గంతోనే వుంటారు. ఎందువల్లననగా వారిద్దరూ భూస్వాముల, పెట్టుబడిదారులనుండి విముక్తిపొందాలనే సమానాశయం కోసం పోరాడుతారు. ఇక ఆస్తి ఉన్న రైతు తనస్థితిని కాపాడుకోవాలని కోరతాడు. అందువలన యితని ఆశయాలు

శ్రామికవర్గం యొక్క ఆశయాలకు విరుద్ధంగా వుంటాయి దోపిడివర్గాలకు వ్యతిరేకంగా పోరాడాలన్న సమాన ప్రధానాశయం కార్మిక, కర్షకులకు వుండినంతకాలం యీ పరస్పర విరుద్ధత పరస్పర వ్యతిరేకంగా పరిణమించదు ఈసమానఆశయమే తుదకు యీవర్గాల మధ్య పరస్పరవైరుధ్యం క్రమేణాపోవడానికి పునాదిగా వినియోగ పడుతుంది.

కాని, బస్తీలలోనూ, పల్లెలలోనూ యింకా దోపిడీశక్తులు వుండటం మూలంగా నూతన ప్రజాతంత్ర దేశాలలో యింకా పరస్పర విరుద్ధశక్తులు అలాగేవుండిపోయాయి. ప్రభుత్వం, ప్రభుత్వ ఆస్తితోసహా పెట్టుబడిదారుల, వర్తకుల ఆస్తులుకూడా యింకా ఉన్నాయి. నూతన ప్రజాతంత్ర దేశాలలో ప్రవేశపెట్టబడిన సాంఘిక సంస్కరణలు యింకా దోపిడి దారులలో అధికసంఖ్యాకవర్గమైన కులక్ల (ధనికరైతులు) ఆర్థిక పునాదిని బలహీనపరచలేదనే విషయం అందరికీ తెలిసినదే.

విప్లవపూరితమైన మార్పుల తీవ్రత పెరిగినకొద్దీ ధనికరైతు (కులక్) ప్రతిఘటన అధికమవుతూవుంటుంది. గ్రామసీమల్లో వుండే అభివృద్ధి నిరోధకశక్తు లన్నింటికీ కులక్ పెద్ద అండగా నిలబడి వుంటాడు. సోషలిస్టుపద్ధతులలో చిన్నరైతు ఆర్థికవిధానాన్ని మార్చకుండా యీ పెట్టుబడిదారీ వర్గాన్ని రద్దుచేయడం సాధ్యపడదు. కాని యీ చిన్నరైతు ఆర్థికవిధానాన్ని మార్చడానికి దీర్ఘ ప్రయత్నాలు అవసరం. కేపిటలిస్టు శక్తుల ఆధిక్యతను పరిమితం చేయడానికి అదేపనిగా కృషిచేయడం మూలంగానూ, కార్మికవర్గ నాయకత్వాన శ్రామిక రైతాంగంతో కార్మికవర్గానికున్న మిత్రత్వాన్ని బలపరచుకోవడం మూలంగానూ, సోషలిస్టు పరిశ్రమలను అభివృద్ధిచేయడం మూలంగానూ ధనికరైతువర్గాన్ని రద్దుచేసి వ్యవసాయాన్ని సమాజపరంచేయడానికి వీలవుతుంది.

పట్టణాలలోనూ, పల్లెలలోనూ వుండే పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా ఎడతెగని ఖచ్చితమైన వర్గ పోరాటం అదేపనిగా సాగించనిదే సోషలిజానికి పురోగమింపజేసే శాసనాలను అమలులో పెట్టడం, వచ్చిన ప్రజాతంత్ర మార్పులను అభివృద్ధి చేసుకొని వాటిని సంఘటిత పరచుకోవడం సాధ్యపడదు. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం అత్యధిక మెజారిటీ సంఖ్యగల ప్రజానీకం బలంపై ఆధారపడుతూ, జాతీయ ఆర్థిక విధానంలోని కీలకస్థానాలన్నింటిపైనా తగిన కంట్రోలు వుంచుకొంటే అది ప్రజల ప్రజాతంత్ర విజయాల సాధనకూ, సోషలిస్టు పునర్నిర్మాణానికీ ఒక ప్రధాన ఆయుధంగా వినియోగబడుతుంది. నూతన ప్రజాతంత్ర దేశాలలో సోషలిజానికి జయప్రదంగా పురోగమించాలంటే కార్మిక కర్షకుల ప్రజాతంత్రరాజ్యాంగ యంత్రాన్ని బలపరచుకోవడం ప్రధానంగా అత్యవసరం.

సోషలిజం విజయంకోసం ఎల్లప్పుడూ ఖచ్చితంగా పోరాడేది కమ్యూనిస్టు పార్టీలే. కమ్యూనిస్టుపార్టీలు వృద్ధిచెంది, బలపడటం, ప్రజలతో వాటి సంబంధాలను విస్తరింపజేయడం, ప్రజానీకాన్ని కమ్యూనిస్టుపార్టీలచుట్టూ సమీకరించడం – యివీ నూతన ప్రజాతంత్రరాజ్యాలు సోషలిజానికి జయప్రదంగా పరివర్తన చెందడానికి ఖచ్చితమైన గ్యారంటీలు.

* * * *

వర్గపోరాట ఫలితంగానూ, దోపిడీదారులను సర్వనాశనం చేయడము మూలంగానూ ప్రజల నైతిక రాజకీయ ఐక్యత సాధించబడుతుందని సోవియట్ యూనియన్ యొక్క ప్రపంచ చరిత్రాత్మక అనుభవం బోధించుతోంది. పరస్పర విరుద్ధంగావున్న వర్గాలతో చీలిపోయిన సమాజంలో ఒకే ఏకైక ప్రజ అనేది వుండనే వుండదు. పెట్టుబడిదారీ సమాజంలో ప్రజల ఐక్యతను గురించి బూర్జువా రాజకీయనాయకులు వాగేదంతా వర్గవైరుధ్యాలను ముసుగులోవుంచి, పీడితులూ, పీడకులు గల సమాజాన్ని అలాగే అట్టేపెట్టి వుంచడానికి మాత్రమే ఉద్దేశించబడింది.

ప్రజలను వర్గాలుగా విభజించుతున్నారని మార్క్సిస్టులను తిట్టిపోసే బూర్జువా సామాజిక శాస్త్రజ్ఞులు అత్యధిక మెజారిటీ ప్రజలపై దోపిడీదారులు పెత్తనం చేయడాన్ని సమర్థించుతారు. ప్రజలు వర్గాలుగా విభజించి ఉండటాన్ని మార్క్సిస్టులు కనిపెట్టివుండలేదు. ఆ విధమైన విభజన సమాజంలో నిజంగా వున్నదని వారు చూపెడుతున్నారు. సమాజం వర్గాలుగా విభజించబడి ఎల్లప్పుడూ అలాగే వర్గపోరాటం జరగడాన్ని మార్క్సిస్టులు కోరరు. వర్గవైరుధ్యాలు రద్దుకావడానికి వారు మార్గాన్ని చూపెడతారు.

వర్గసమాజంలోని ప్రజలలో వర్గవిబేధాలు వున్నవని గుర్తించడం ద్వారా, సమాజాన్ని సోషలిస్టు పద్ధతులపై పునర్నిర్మాణం చేసేసందర్భంలో కార్మికవర్గ నాయకత్వ పాత్రను గుర్తించడంద్వారా, పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా వర్గపోరాటాన్ని కొనసాగించడం ద్వారా, ప్రజల నిత్యజీవితంలోనే సోషలిస్టుమార్పులు ప్రవేశపెట్టడం ద్వారా, శ్రామికవర్గేతర కష్టజీవులలో చైతన్యాన్ని కలుగజేయడం ద్వారా ప్రజలలో సంపూర్ణమైన నైతిక - రాజకీయ ఐక్యతను చేకూర్చగలం; సోషలిస్టు విజయానికి పురోగమించగలం; అన్నివిధాలైన సాంఘిక, రాజకీయ బానిసత్వాలనుండి జనసామాన్యాన్ని పరిపూర్ణంగా విముక్తి చేయగలం.

ఒక మనిషి మరొక మనిషిని దోపిడిచేసే విధానాన్ని ప్రపంచంలో మొట్టమొదటిసారిగా అంతంచేసిన సమాజం సోవియట్ సమాజమే. అక్కడ వర్గ విబేధాలు రద్దుచేయబడినాయి. స్నేహసంబంధాలు, కార్మికుల మధ్య స్నేహపూరితమైన సహకారమూ, పరస్పర సహాయమూ నెలకొల్పబడింది. దోపిడీనుండి ప్రజలు విముక్తి చేయబడ్డారు.

కార్మికవర్గం యొక్క ప్రపంచ చరిత్రాత్మక పాత్రను గురించిన మార్క్సిస్టు-లెనినిస్టు ఉపదేశాలలోని సత్యం రష్యా విప్లవం సందర్భంలో అత్యద్భుతంగా ఆచరణలో ప్రదర్శితమైంది.

టికి ప్రబలమవుతూఉంది. ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకొనే అధికారం తనకున్నదని శ్రామికవర్గం స్పష్టంగా గుర్తిస్తూవుంది. ఈరెండు ద్వేషాలమధ్య పొత్తు కుదరడం అసంభవం. ఈ రెండువర్గాల మధ్య సంఘర్షణ జరగక తప్పదు. ఆ సంఘర్షణలో శ్రామిక వర్గం విజయం సాధించితీరుతుంది. ద్వేషం నుంచి ప్రపంచాన్ని విముక్తంచేస్తుంది.

## శ్రామికవర్గ నియంతృత్వం

"మీ దేశంలో ఏర్పడిన శ్రామికవర్గ నియంతృత్వం రైతులపై బలప్రయోగంగా పరిణమిస్తుంది అని అనేకమంది ఇతరులతో పాటు మేంకూడా అభిప్రాయపడుతున్నాం." అని మీరు వ్రాస్తున్నారు. ఈ సందర్భంలో నేను మీకొక సలహా ఇస్తాను. 'అనేకమంది ఇతరులతోపాటు' కాకుండా మీరు మార్క్సిజాన్ని లెనినిజాన్ని అంగీకరించే మేధావులతోపాటు -వారు సంఖ్యలో కొద్దిమందే అయినా - కలిసి ఆలోచించండి. మార్క్సిజం-లెనినిజం ఒక్కటే అత్యున్నత శాస్త్రీయసిద్ధాంతం. ఆ సిద్ధాంతంద్వారానే నిజమైన సాంఘిక న్యాయం నెలకొంటుంది. నూతన కళా స్వరూపాలు స్వేచ్ఛగా అభివృద్ధి చెందుతాయి. కొంచెంసేపు మీరు మీవర్గ సంబంధాలను మరచిపోయి వాస్తవిక విషయాలను పరిశీలించండి. మీరు సంబంధబాంధవ్యాలు నెరపే పెట్టుబడిదారీవర్గ చరిత్ర అంతా కష్టజీవులైన ప్రజాసామాన్యంపై నైతికంగా శారీరకంగా చేసిన-చేస్తూన్న హింసాకాండ చరిత్రే. ఈ విషయాన్ని మీరు సరిగా అవగాహన చేసుకోగలిగితే మీ వర్గమే మీకు శత్రువని తెలుసుకుంటారు. కార్ల్‌మార్క్స్ గొప్ప ప్రతిభావంతుడే. అంతమాత్రాన ఆయనను బృహస్పతి నోట్లోనుంచి ఊడిపడిన సరస్వతీదేవి అనుకోగూడదు. తమ తమ రోజుల్లో న్యూటన్, డార్విన్‌లు ఏ విధంగా నూతన శాస్త్రీయ సిద్ధాంతాలను కనిపెట్టారో అదే విధంగా కార్ల్‌మార్క్స్ కూడా అనుష్ఠాన పూర్వకమైన శాస్త్రీయ ప్రయోగాలద్వారానే ఈ నాటి విషయాలను సిద్ధాంతీకరించాడు. మార్క్స్‌లాగే లెనిన్‌కూడా గొప్ప ప్రతిభావంతుడు. మార్క్సిజాన్నే లెనిన్ ఇంకా స్పష్టంగా సుబోధకంగా విప్పిచెప్పాడు. ఈ ప్రబోధకులిద్దరూ ప్రప్రథమంగా మీరే వర్గానికి సేవచేస్తున్నారో తెలియ చెప్పుతారు. తన స్వార్థసిద్ధికోసం ఈ పెట్టుబడిదారీవర్గం ఏ విధంగా అబద్ధాలపైనా వంచనపైనాఅమానుషహింసాకాండపైనా రక్తపాతంపైనా ఆధారపడి ఈ 'సంస్కృతి'ని నిర్మించిందో మీ కండ్లకు కట్టేటట్టు చూపుతారు, ఈ 'సంస్కృతి' ఇప్పుడే విధంగా పతనమై క్షీణించిపోతూ ఉందో మీకు బోధపరుస్తారు.

## హింస

ఇక హింసను గురించి కొంచెం మాట్లాడుదాం. శ్రామికవర్గ నియంతృత్వం అనేది ఒక తాత్కాలిక పరివర్తనదశమాత్రమే. బూర్జువాప్రభుత్వానికి ఇంతకాలం నుంచి బానిసలుగా ఉన్నకోట్ల కొలది ప్రజలను దేశానికీ, దేశంలోని సిరిసంపత్తికీ వారినే నాయకులుగా తయారుచేయడం కోసం ఈ తాత్కాలికదశ అవసరం అవుతుంది. ఆర్థికంగా, రాజకీయంగా కష్టజీవులైన ప్రజలందరికీ, రైతాంగమంతటికీ సమాన ప్రాతిపదిక ఏర్పడిన వెంటనే-సంఘం

లోని ప్రతిసభ్యునికీ శక్తికొలదీ పని చేయడానికి అవసరమైనంత తీసుకోడానికీ అవకాశం లభించిన వెంటనే - శ్రామికవర్గ నియంతృత్వంయొక్క ఆవశ్యకత లేకుండా పోతుంది. 'తదితరులనేకమంది'తో పాటు మీరుకూడా 'హింస' (వైలెన్సు) అనే మాటను తప్పుడర్థం చేసుకుంటున్నారు. సోవియట్ యూనియన్ కార్మికవర్గంగానీ కమ్యూనిస్టుపార్టీగానీ హింస చేస్తుందని మీరు వినేమాటలన్నీ అసలు చాలావరకు సర్వాబద్ధాలు సోవియట్ యూనియన్‌లో నేడు జరుగుతూ ఉన్న ఒక నూతన సాంఘికపరిణామానికే కార్మికవర్గ శత్రువులు 'హింస' అనే పేరుపెట్టి సోవియట్ సంస్కృతిని, సోవియట్ ఆర్థికవిధానాన్ని అప్రతిష్ఠ పాలుచేయాలని ప్రయత్నిస్తున్నారు.

'నిర్బంధం' అనే విషయాన్ని గురించి అయితే మాట్లాడడం సాధ్యమవుతుంది. నిర్బంధానికీ హింసకూ చాలా తేడాఉంది. పిల్లలను నిర్బంధంగా చదివించడమంటే హింసను ప్రయోగించడమవుతుందా? అదే విధంగా సోవియట్ యూనియన్ కార్మికవర్గం, ఆ వర్గపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ రైతులకు సాంఘిక రాజకీయ 'ఓనమాలు' నేర్పుతూ ఉంది. 'సుత్తికీ దాగలికీ మధ్య' బుద్ధిజీవులైన మీ జీవిత నాటకాన్ని మలచడానికి, దిద్దడానికి మీరు కూడా మరొకరు సాంఘిక రాజకీయ 'ఓనమాలు' నేర్పుతూనే ఉన్నారు. కాని ఈ 'మరొకరు' నేనుమాత్రం కాదు.

# రైతులకర్తవ్యం

పరాన్న భుక్కులూ, దోపిడివర్గమూ తయారుకావడానికి రైతాంగమూ, లక్షలకొలదీ ఉన్న తదితర కొద్దిపాటి ఆస్తిపరులూ, అనుకూలవాతావరణాన్ని సృష్టిస్తున్నారు. ఈ వాతావరణంనుంచే సర్వదుర్గుణ సమ్మిళితమైన పెట్టుబడిదారీ విధానం ఉత్పన్నమవుతూఉంది. రైతుల శక్తిసామర్థ్యాలన్నీ, ఆ బారెడుముక్కను సాగుజేయడంలోనే సమాప్తమవుతున్నాయి. లక్షాధికారుల్లాగే ఈ రైతాంగంకూడా అజ్ఞానావృతమై ఉంది. విజ్ఞానాన్ని ఆర్జించడానికి నేడు వారికెలాంటి అవకాశాలూ లేవు. బుద్ధిజీవులైన మీరు ఈ యదార్థవిషయాన్ని గమనించే ఉంటారు. లేక కనీసంఊహించగలిగి అయినా ఉంటారు. నవంబరు విప్లవానికి పూర్వం రష్యారైతులస్థితిగతులు 17 వ శతాబ్దంనాటి పరిస్థితులకంటె ఏమాత్రం బాగాలేవు. రష్యాలో సోవియట్ ప్రభుత్వంఏర్పడింది అనేకోపంతో విదేశాలకు వెళ్ళి తలదాచుకుంటూన్న దోపిడిముఠాకు చెందిన రష్యన్లుకూడా ఈ యదార్థాన్ని కాదనలేరు.

అనాగరికదశల్లో రైతులు ఎంతో కాలం ఉండరు. ధనికరైతుల, భూస్వాముల జమీందారుల వలలో రైతులు పడగూడదు. చారెడు చారెడు ముక్కలుగా చీలిపోయిన కొద్దిపాటి భూమినిసాగుజేసుకుంటూ శిక్షబడ్డ ఖైదీల్లాగా రైతులు తమ జీవితాన్ని గడపరాదు. భూమితో ఎట్టి సంబంధం లేకుండా, ఎన్నడూ భూములను బలపరచకుండా ఉండే సోమరిపోతులైన భూస్వాములకు తాము చెమటోడ్చి రెక్కలు ముక్కలు చేసుకొని పండించిన పంటలో కొంతభాగాన్ని సమర్పించుకొని అర్ధాకలితో నకనకలాడుతూ రైతులు పస్తులు పండుకోవడం తగదు. మతసంస్థలనూ పెట్టుబడిదారీవిధానాన్నీ బలపరచే మాల్థస్ తప్పుడు సిద్ధాంతానికి రైతులు

తలవంచగూడదు. (ఆహారోత్పత్తికంటె సంతానోత్పత్తి వేగంగా జరుగుతూ ఉందనీ, నేటి పేదరికానికి కారణం జనాభా పెరుగుదలే కాని పెట్టుబడిదారీ విధానం కాదనీ మాల్థస్ సిద్ధాంతం.- అనువాదకుడు) తమ స్థితి నానాటికి దిగజారి ఏవిధంగా అధ్వాన్నమైపోతూ ఉందో రైతులు స్వయంగా గ్రహించలేని పక్షంలో కార్మికవర్గం నిర్బంధంగానైనా వారిలో ఈ చైతన్యాన్ని కలిగించవలసి ఉంటుంది. అయినా సోవియట్ యూనియన్ లో ఈ నిర్బంధంతో అవసరం లేకుండానే పనిసాఫీగా జరిగిపోతూఉంది.

1914-1918 ప్రపంచ యుద్ధఫలితంగా రష్యా రైతులు అనేక కష్టనష్టాలకు గురి అయ్యారు. నవంబరు విప్లవం వారిలో ఒక నూతన జీవంపోసింది. ఒక నూతన చైతన్యం కలిగించింది. సోవియట్ రైతు అజ్ఞానాంధకారంనుంచి బైటపడ్డాడు. తన మంచి చెడులను తానే ఆలోచించుకోగల స్థితిలోకి వచ్చాడు. రైతులకు కావలసిన యంత్రాలూ ఎరువులూ వగైరాలను ప్రభుత్వమే సప్లయి చేస్తూవుంది. విజ్ఞానాన్ని ఆర్జించడానికి అనేక అవకాశాలు లభ్యమయ్యాయి. ప్రతి సంవత్సరం అనేకవేలమంది రైతుబిడ్డలు ఇంజినీర్లుగానూ, ఆర్థిక శాస్త్రవేత్తలుగానూ, డాక్టర్లుగానూ ఉత్తీర్ణులై నూతన జీవితం ప్రారంభిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన సోవియట్ కార్మికవర్గం సోవియట్ యూనియన్‌లో ఒకే ఒక యజమానిని - 16 కోట్ల తలలూ, 32 కోట్ల చేతులూ కలిగిన ఒకే ఒక యజమానిని - సృష్టించేందుకు (అంటే ప్రజలనే నాయకులుగా తయారుచేసేందుకు- అను)పోరాడుతూవుందని రైతులు గ్రహించసాగారు. ఈ విషయాన్నే రైతులు పూర్తిగా అర్థం చేసుకోవలసివుంటుంది. సోవియట్ యూనియన్‌లో జరుగుతూన్న ప్రతిపనీకొద్దిమంది ధనికులకోసంగాక ప్రజలందరికోసం ప్రజలందరి శ్రేయస్సుకోసం-జరుగుతూవుందనిసోవియట్ రైతులు స్పష్టంగా చూడగలుగుతున్నారు. సోవియట్ యూనియన్‌లో స్థాపించబడిన 26 వ్యవసాయ శాస్త్రపరిశోధన సంస్థలూ భూసారాన్ని అభివృద్ధిచేయడానికీ, తమ రెక్కలకష్టాన్ని తగ్గించడానికీ, ఊపిరి సల్పకుండా ఏవిధంగా కృషిచేస్తున్నాయో, ఎందుకోసం కృషి చేస్తున్నాయో, సోవియట్ రైతు నేడు స్పష్టంగా అర్థం చేసుకుంటున్నాడు.

శతాబ్దాలనుంచీ తాను నివసిస్తోన్న ఆమురికి కూపాల్లోనే ఇంకాపడి ఉండాలని రైతుకోరడంలేదు. పాఠశాలలూ, కళాశాలలూ, నాట్యశాలలూ, వైద్యశాలలు, క్లబ్బులు, గ్రంథాలయాలూ, సినీమాలతో నిత్యం కళకళలాడే వ్యావసాయికనగరాల్లో నివసించాలని రైతు తహతహలాడుతున్నాడు. రైతుల్లో జ్ఞానపిపాస దిన దిన ప్రవర్థమానమవుతూ ఉంది. సాంస్కృతిక జీవితంపై అభిరుచి పెరుగుతూఉంది. సోవియట్ రైతులు ఈ విషయాలను గ్రహించక పోయినట్లయితే, సోవియట్ రైతాంగం హృదయపూర్వకంగా తన సంపూర్ణ సహకారాన్ని అందించకపోయినట్లయితే గత 15 సంవత్సరాల్లో సోవియట్ కార్మికవర్గం ఇంతటి మహత్తర విజయాలను సాధించ గలిగి ఉండేదే కాదు.

బూర్జువా ప్రభుత్వాలు తమ దేశాల్లోని కార్మిక ప్రజలను ఒక గ్రుడ్డియాంత్రికశక్తి (మెకానికల్ ఫోర్స్)గా తయారు చేస్తాయి. అందువల్లవారు త

శ్రమయొక్క సంస్కృతీ ప్రాముఖ్యతను గుర్తించలేరు. మీ దేశాల్లో ఆర్థికసంస్థలూ ఆర్థిక సంఘాలూ అనేకం ఉన్నాయి. ఇవన్నీ జాతీయ శక్తులను దోపిడిచేసేవే. కష్టజీవులైన ప్రజలపై పరాన్నభుక్కులైన సోమరిపోతులను ఎక్కించేవే. దోపిడిలో భాగాలుకోసం వీళ్ళు తమలో తాము పోట్లాడుకుంటూ ఉంటారు. ఒకళ్ళను ఒకళ్ళు నాశనం చేసుకోడానికి డబ్బుతో చెలగాటమాడతారు. అనేక కపటనాటకాలు ఆడుతారు. ఇవన్నీ ఈనాటి విపరీతమైన ఆర్థిక మాంద్యానికి దారితీశాయి. కోట్లకొలది ప్రజలు ఆకలి మంటలతో అలమటించి పోతున్నారు. బుద్ధిపూర్వకంగా బూర్జువా ప్రభుత్వాలు ప్రజారోగ్యాన్ని మంట గలిపేస్తున్నాయి. శిశుమరణాల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతూఉంది. ఆత్మహత్యలు అధిక మవుతున్నాయి. సంస్కృతికి మూలశక్తియైన మానవశక్తి శుష్కించి నీరసమైపోతూ ఉంది. ఇంత జరుగుతున్నా మీ అధికారవర్గానికి చీమ కుట్టినట్లయినాలేదు. నిరుద్యోగులకు సహాయంజేసే నిమిత్తం 37½ కోట్ల డాలర్లను ప్రత్యేకించాలని ప్రతిపాదించిన లా ఫొలెట్ - కాస్టిగన్ బిల్లును మీ సెనేట్ త్రోసివేసింది. 1930 లో 153,731 మందినీ, 1931 లో 198,738 మందినీ నిరుద్యోగంవల్ల అద్దె చెల్లించలేని కారణంగా న్యూయార్కులో ఇండ్లనుంచి బైటికి వెళ్ళగొట్టినట్లు, 'న్యూయార్కు అమెరికన్' అనే పత్రిక ప్రకటించింది.

1932 జనవరిలో ఈవిధంగా న్యూయార్కులో ప్రతిరోజూ వందలమందిని బైటికి వెళ్ళగొట్టడం జరిగింది.

ఇక సోవియట్ యూనియన్‌లోనో? ఆర్థికవిధానమూ, శాసనవిధానమూ రెండూ కార్మికవర్గం చేతుల్లోనూ — వ్యక్తిగత ఆస్తిని నిర్మూలించవలసిన ఆవశ్యకతనూ పొలంపనిని సాంఘికమూ యాంత్రికమూ పారిశ్రామికమూ చేయవలసిన ఆవశ్యకతనూ గుర్తించినటువంటీ, ఫ్యాక్టరీల్లోను తదితర పరిశ్రమల్లోనూ పనిచేసే కార్మికులమానసిక స్వభావాన్ని అలవరుచుకున్నటువంటీ – రైతులచేతుల్లోనూ ఉన్నాయి. సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో పనిచేసే వారి సంఖ్యా, కమ్యూనిస్టుల సంఖ్యా రోజురోజుకు అధికమవుతూ ఉంది. బానిసత్వావశేషాలనుంచీ, మత దాస్యంనుంచీ, మూఢవిశ్వాసాలనుంచీ పూర్తిగా బైటబడినకొలదీఈసంఖ్యఇంకా అతిశీఘ్రంగా అభివృద్ది చెందుతుంది,

సోవియట్ యూనియన్‌లో చట్టాలు పైనుంచిగాక క్రిందినుంచి - కష్టజీవులైన ప్రజలనుంచి - రూపొందుతూ ఉంటాయి. ప్రత్యక్షజీవిత ప్రవాహంనుంచే అవి పైకి ఉబుకుతాయి. కార్మికుల రైతుల శ్రమజీవితంలో కాలుతీరి నిగ్గుదేరిన వాటినే సోవియట్ ప్రభుత్వం చట్టంచేస్తుంది. కష్టజీవుల కేంద్రనిర్మాణానికి సంబంధించినంతవరకు పార్టీ ఒక నియంతయే. సమస్త ప్రజాసమూహంలో పతివ్యక్తికి తనశక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేసుకునేందుకు తగినంత సంపూర్ణావకాశాన్ని కలిగించి శారీరక శక్తినంతా బౌద్ధికశక్తిగా మార్చడమే పార్టీ ఆశయం.

# అరాచక సిద్ధాంతాలు

వ్యక్తిత్వానికి ప్రాధాన్యత ఇవ్వాలి అని గొంతుకచించుకుంటూ కేకలువేసే బూర్జువా ప్రభుత్వాలన్నీ తమ ప్రయోజనాలకూ, తమ సాంప్రదాయాలకూ అనుగుణంగా యువకులకు తర్బీతునిస్తాయి.

అవును. ఇదిసహజమే. ఈ బూర్జువాసమాజంలో నవయువకుల్లోనే అరాచకస్థితిగతాలు తల ఎత్తుతూ ఉన్నాయి, ఇది ఒక అస్వాభావిక లక్షణం. హద్దూపద్దులేని వ్యక్తిస్వాతంత్ర్యం ఫలితంగా సమాజం మొత్తం నాశనమయ్యే కల్మషపూరిత వాతావరణానికి ఈ అస్వాభావిక లక్షణము ఒక నిదర్శనం. ఈ అస్వాభావిక లక్షణాలను గురించి మీ యువకులు ఊహాగానం చేయడమే కాకుండా వాటిని ఆచరణలోకూడా పెడుతున్నారనే విషయం మీరు బాగా ఎరుగుదురు. ఉభయ ఖండాల్లోను యువకులుచేసే 'కుచేష్ట'లను గురించి యూరోపియన్ పత్రికలు అదే పనిగా రిపోర్టులపై రిపోర్టులు ప్రకటిస్తున్నాయి. ఈ 'కుచేష్టలు' - అపరాధాలు- భౌతికావశ్యకత ఫలితంగా జరిగేవికావు. 'జీవితంలోని విసుగుదల' ఫలితంగా కొత్తదనం కోసం విషయ లంపటత్వం కోసంజరిగేవి. వ్యక్తిత్వాన్నీ, మానవజీవితాన్నీ అతిహీనదృష్టితో చూడడమే ఇందుకు మూలకారణం. కార్మికుల్లోనుంచి, రైతుల్లోనుంచి పతనమైన కొందరు 'నాయకులను' బూర్జువావర్గం తనలో చేర్చుకొని వారిద్వారా తనప్రయోజనాలను సాధించుకోజూస్తుంది. ఇలాంటి నాయకులు వ్యక్తిగతంగా తమస్వార్థాన్ని ఆశించి బూర్జువావర్గం చేతుల్లో కీలుబొమ్మల్లాగా తయారై వారాడించిన అబద్ధాలన్నీ జంకూకొంకు లేకుండా ఆడతారు. కార్మిక కర్షకవర్గాలకు ద్రోహం చేస్తారు. యూరోపియన్, అమెరికన్ సాహిత్యంలో పూర్తిగాబూర్జువావర్గాన్ని నిలబెట్టేందుకు అనేక విఫలప్రయత్నాలు జరుగుతున్నాయి. బూర్జువాచరిత్ర అంతా ఆవర్గంయొక్క మానసిక దివాలాకోరుతనాన్ని వెల్లడించే చరిత్రే. బూర్జువావర్గంలో ఈనాడు గర్వించదగిన సుగుణాలేమీలేవు. హిట్లరులాంటి యుద్ధోన్మాదులు వెల్లడించే యుద్ధావేశాలూ, జాతిద్వేషాలూ మినహా ఆవర్గానికి మరే గర్వకారణంలేదు.

సోవియట్ప్రజలు నేడొక నూతన విజ్ఞాన యుగంలో ప్రవేశిస్తున్నారు. నవంబరు విప్లవం లక్షలకొలది ప్రతిభావంతులను క్రియాశీలురుగా చేసింది. కాని కార్మికవర్గాశయాలన్నిటినీ సాధించడానికి వారుమాత్రమే చాలరు. ఇంకా చాలా మందిని తయారుచేయవలసి ఉంటుంది. చేస్తూఉంది. సోవియట్ యూనియన్లో నిరుద్యోగ సమస్య అంటూ లేనేలేదు. ప్రతి క్షేత్రంలో - ప్రతిరంగంలో - మహత్తర విజయాలను సాధించడానికి ఇంకా ఎందరో అవసరం.

ఓ మేధావులారా! కళావేత్తలారా! కార్మికవర్గం రాజకీయాధికారాన్ని తన హస్తగతం చేసుకోడంతో మీ సృజనాత్మకకృషికి ఎన్ని మహత్తర అవకాశాలు లభిస్తాయో ఇప్పటికైనా గుర్తించేఉంటారు.

రష్యన్ మేధావివర్గానికి చరిత్రఎంతటి కఠోర పాఠాన్ని నేర్పిందో ఒకసారి పరికించండి! తమ కష్టజీవులైన ప్రజలతో భుజంభుజం కలిపి వారితోపాటు కొందరు మేధావులు ముందుకు నడవలేకపోయ్యారు. నేడు సోవియట్ ప్రభుత్వాన్ని ఎదుర్కోడం తమ శక్తికిమించిన పని అయ్యేటప్పటికి ఏమీ చేయలేక లోలోపల కుమిలిపోతున్నారు, విదేశాల్లో తలదాచుకుంటూ పతనమై చివికి చివికి పోతున్నారు. వాళ్ళకు మరణం ఆసన్నమైంది. మరణానంతరంకూడా

వాళ్ళకు ప్రజాద్రోహులనే కళంకం శాశ్వతంగా నిలిచిపోతుంది. బూర్జువా వర్గం అసలు సంస్కృతినే ద్వేషిస్తూఉంది. అవును. ఆ వర్గం నేడు అంతకన్నా చేయగలిగిందికూడా మరేమీలేదు. బూర్జువా దేశాల్లో జరుగుతూన్న వాస్తవిక సంఘటనలే దీన్ని రుజువు చేస్తున్నాయి.

**ఆయుధ విసర్జనకోసం సోవియట్ యూనియన్ చేసిన ప్రతిపాదనను బూర్జువా ప్రభుత్వాలు పూర్తిగా నిరాకరించాయి. పెట్టుబడిదారులు సంఘ ద్రోహులనీ' మరో ప్రపంచ మారణహోమానికి వాళ్ళు సన్నాహం చేస్తున్నారనీ తెలుసుకోడానికి ఈ ఒక్క విషయమే చాలు.**

బూర్జువా ప్రభుత్వా లవలంబించే యుద్ధవైఖరి ఫలితంగా సోవియట్ యూనియన్ కూడా ఆత్మరక్షణ సన్నాహం చేయవలసి వస్తూవుంది. మానవజాతి విజ్ఞానాభివృద్ధికీ, యావత్ ప్రపంచ ప్రాముఖ్యతగల దేశంగా సోవియట్ యూనియన్‌ను నిర్మించడానికీ వినియోగించవలసిన ఎంతో వస్తుసంపదనూ, శ్రమశక్తినీ, అమూల్య కాలాన్నీ సోవియట్ కార్మికవర్గం ఆయుధ నిర్మాణంకోసం వెచ్చించవలసివస్తూవుంది.

పతనోన్ముఖమైన బూర్జువా వర్గం ద్వేషంతోనూ వ్యాకులత్వంతోనూ ఉన్మత్తమై తనకు భవిష్యత్తులో పట్టబోయే గతికి భీతావహం చెంది ఒక ప్రవాహం లాగా మూర్ఖులను ఉత్పత్తిచేస్తూఉంది. బూర్జువావర్గం తమనేవిధంగా గోతిలో దింపబోతూవుందో ఈమూర్ఖులు గ్రహించలేకపోతున్నారు. యూరప్‌లోని ప్రభువులకూ, బూర్జువా నాయకులకూ, ఒకానొకమూర్ఖుడు ఇలా విజ్ఞప్తి చేస్తున్నాడు:

"మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీని నాశనం చేయడానికి ప్రస్తుత సమయంలో పచ్చజాతులనుకూడా యూరప్ రాజ్యాలుఉపయోగించుకోవాలి"

యూరప్‌లోని ప్రభువుల, బూర్జువా నాయకుల భావాలనే ఈ మూర్ఖుడుకూడా ప్రతిబింబించి ఉంటాడు. ఈ మూర్ఖుని భావాలనే అమల్లో పెట్టడానికి కొందరు 'పెద్దలు' తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. బాధ్యతలేని ఇలాంటి 'పెద్దలే' యూరోపునూ అమెరికానూ పరిపాలిస్తున్నారు. యూరోపియన్లకు వ్యతిరేకంగా, 'తెల్లజాతు'లన్నింటికి వ్యతిరేకంగా తీవ్ర జాతిద్వేషాన్ని రగుల్కొల్పడానికి ఇండియాలో, చైనాలో, ఇండోచైనాలో జరుగుతూన్న సంఘటనలేచాలు. ఇది మూడో ద్వేషం. జాతిద్వేషం. ఓ జీవకారుణ్య హృదయులారా! ఈద్వేషాలు మీతోటే సమసిపోతాయా? లేక మీ బిడ్డలకు కూడా సంక్రమింపచేయదలచుకున్నారా? 'పరిశుద్ధ జాతీయరక్తం' అనే సిద్ధాంతాన్ని ప్రబోధించడంద్వారా జర్మనీ జాతిద్వేషాన్ని రెచ్చగొట్టడంద్వారా కళావేత్తలారా! మీకు లాభించేదేమిటి? ఇందుకొక ఉదాహరణ చూడండి.

"గెటే (జర్మనీ మహాకవి) శత సంవత్సర వర్ధంత్యుత్సవ సందర్భంలో థామస్ మన్, వాల్టర్‌వాన్ మోలో, ప్రొఫెసర్ హెర్నీలు పాల్గొనగూడదని తురింజియాలో హిట్లర్ పార్టీనాయకుడైన సాకెల్ జాతీయ సోషలిస్టు(నాజీ) గ్రూపు వీమర్‌కు ఆదేశించాడు. పైన పేర్కొనబడినవారు ఆర్యజాతికిచెందిన

వారు కాకపోవడంవల్ల ఈ ఉత్సవంలో పాల్గొనరాదు."

జాతిద్వేషం ఎలాంటి ఫలితాన్ని ఇచ్చిందో చూడండి!

కళావేత్తలారా! మీరే పక్షమో నిర్ణయించుకోవలసిన సమయమిదే. నూతన జీవితస్వరూపాను దిద్దితీర్చే సంస్కృతికోసం పాటుబడేపక్షంలో ఉంటారా? లేక ఈ పక్షానికి వ్యతిరేకంగా కుతుకబంటి బురదలో కూరుకొనిపోయి జడమై మరణావస్థలోనున్న బాధ్యతారహితమైన పెట్టుబడిదారీ విధానాన్ని – దోపిడీదారీ విధానాన్ని – నిలబెట్టబూనుకుంటారా?

[గోర్కీ 81 వ జయంత్యుత్సవ సందర్భంలో 'న్యూటైమ్స్' పత్రిక ప్రకటించిన అనుబంధంనుండి, 16-4-49]



# ఆసియా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్

## పెట్టుబడుదారుల పెంపుడుబిడ్డ

కె. ఇవనెంకో

ఆసియా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ నిర్మాణానికి అవసరమైనఏర్పాట్లు చేసేందుకు ఇండోరు (ఇండియా)లో ఒక కమిటీ సమావేశం కాబోతూఉంది. ఆసియాఖండ దేశాల్లో జరిగే సమ్మెలను భగ్నం చేసేందుకే ఈ ఫెడరేషన్ నిర్మాణం జరుగుతూఉంది. ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహళం, ఫిలిప్పైన్స్, ఇండోనీసియా, ఇరాన్, టర్కీ, ప్రభుత్వాలు పోలీసు లాఠీల అండతో సృష్టించిన బూటకపు సంఘాల ప్రతినిధులే ఈ సమావేశంలో పాల్గొంటారు.

1947 లో నెహ్రూ ప్రభుత్వమూ, భారత జాతీయకాంగ్రెసూ సృష్టించిన భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ దీనికి ప్రధానసూత్రధారిగా పని చేస్తుంది. అయితే దీనికి తెరమరుగున ఉండి అసలు నాటకం ఆడించేశక్తులు వేరే ఉన్నాయి. ఇండోరులో జరగబోయే సమావేశానికి అమెరికా లేబరు ఫెడరేషన్ ప్రతినిధులు 'సలహాదారుల' హోదాలో హాజరవుతారని ఢిల్లీనుంచి వెలువడిన ఒక ప్రత్యేకప్రకటన తెలుపుతూవుంది. అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు అధ్యక్షుడైన విలియమ్‌గ్రీన్ పశ్చిమ యూరప్‌లో పైఫెడరేషన్‌కు ప్రతినిధిగా ఉన్న ఇర్వింగ్ బ్రౌన్ ఇండోరు సమావేశానికి హాజరవుతారని ఏప్రిల్ 16 వ తేదీన అమెరికాప్రభుత్వం ప్రకటించింది.

భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులూ, కార్మికరంగంలో పనిచేసే వారి ఏజెంట్లూ తమ ఆంగ్లో-అమెరికన్ యజమానుల ఉత్తరువులను శిరసావహించి ఈ ఇండోరు సమావేశాన్ని జరపబోతున్నారు. ఆసియాదేశాల్లో ఉప్పెనలాగా ఉవ్వెత్తుగా పొంగివస్తూఉన్న జాతీయ విముక్తి పోరాటాలనూ, కార్మికవర్గ పోరాటాలనూ చూచి గుండెలు దిగజారుతూన్న బ్రిటిష్ అమెరికా సామ్రాజ్యవాదులు కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నంచేయడానికై ఈ ఎత్తుగడలనవలంబించారు. బూటకపు సంఘాలను కొన్నిటినిసృష్టించారు. తమస్వార్థ సాధనకై మితవాద సోషలిస్టులను కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నంచేసే కార్యక్రమానికి ఉపయోగించుకుంటున్నారు. ఆసియా దేశాలన్నింటిలో ఈకుట్రలను కొనసాగించ

డానికి భారతజాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును ఒక కేంద్రంగా తయారు చేసుకుంటున్నారు. కాబట్టి ఈ భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును గురించీ దీని ఆశయాలనుగురించి తెలుసుకోవడం ఈసందర్భంలో అప్రస్తుతంకాదు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో రాజీ పడి భారత పెట్టుబడిదారీవర్గం అధికారాన్ని చేపట్టడంతోపాటు ఈ జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకూడా అవతరించింది. దేశవ్యాపితంగా ఇండియాలో జాతీయ విముక్తి ఉద్యమం తీవ్రముగా విజృంభిస్తూన్న సమయం అది. ఈ ఉద్యమ తీవ్రతకు బ్రిటిషు పెట్టుబడిదారులే కాకుండా భారత పెట్టుబడిదారీవర్గంకూడా హడలెత్తిపోయింది. బ్రిటిషు సామ్రాజ్యవాదులతో పొత్తుగలవడానికి కుట్ర పన్నుతూఉన్న భారత దేశంలోని అభివృద్ధినిరోధకులు నిజమైన స్వాతంత్ర్యంకోసం పోరాడుతూ ప్రజల్లో మంచి పలుకుబడిగలిగివున్న అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు వ్యతిరేకంగా తీవ్రమైన దాడి సాగించారు.

ఆనాడు అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు 600 యూనియన్లు అనుబంధసంస్థలుగా ఉన్నాయి. మొత్తం 8 లక్షల సభ్యత్వం ఉంది. అత్యవసరమైన ఆర్థిక హక్కులకోసమే కాకుండా యావన్మంది ప్రజల జాతీయ, రాజకీయ హక్కులకోసం నిరంతరపోరాటం సాగిస్తూన్నందువల్ల ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పలుకుబడి రోజు రోజుకూ పెరిగిపోసాగింది. బ్రహ్మాండమైన సమ్మె పోరాటాలు నడిపింది. 1946 లో జరిగిన ఈ పోరాటాల్లో 20 లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు.

హింసద్వారా నిర్బంధ విధానంద్వారా కార్మికవర్గోద్యమాన్ని అణచలేక, అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును నిర్మూలించి వేయలేక నెహ్రూప్రభుత్వం కార్మికుల్లో చీలికలు కలిగించడానికి పూనుకుంది. ఈ ప్రయోజనాన్ని సాధించడానికే పోలీసులాఠీల అండతో సమ్మె పోరాటాలను విచ్ఛిన్నంచేసే జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును సృష్టించింది. నెహ్రూప్రభుత్వంలో నేడు ఉపప్రధానిగా ఉన్న పటేల్ దీనికి సృష్టికర్త. ఇండియన్ యూనియన్‌లో 'కమ్యూనిస్టు పలుకుబడి'ని అంటే అభ్యుదయ ప్రజాస్వామిక శక్తులను తుడిచిపెట్టివేసేందుకు ఈ జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు స్థాపించబడిందని పటేల్ బాహాటంగానే ప్రకటించాడు.

ప్రభుత్వాధికారుల అండతో పెట్టుబడిదారుల సంపూర్ణ సహకారంతో కార్మిక ప్రజాసామాన్యాన్ని అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు నుంచి దూరంచేసేందుకూ దోపిడీకి వ్యతిరేకంగా వారు సాగించే పోరాటాన్ని నీళ్ళుకార్చివేసేందుకూ, నిజమైన ప్రజాస్వామికోద్యమాన్ని అణచివేసేందుకూ ఈ పోటీ సంఘం సృష్టించబడింది. కార్మికులు తమ హక్కులనూ, అవసరాలనూ సాధించడానికి సమ్మెనొక సాధనంగా ఉపయోగించగూడదని ఈబూటకపు సంఘనాయకులు పదే పదే ప్రకటనలుచేస్తున్నారు. పెట్టుబడిదారీ వర్గంతో 1947 డిసెంబరులో 'పారిశ్రామిక శాంతి' ఒడంబడిక చేసుకొని సమ్మె కార్యక్రమాన్ని నిరసించారు. తమతరఫున ప్రాతినిధ్యం వహించి మాట్లాడడానికి పోలీసుల అండతో పెత్తనం చలాయించే ఈ 'నాయకులకు' ఎట్టి

అధికారం లేదని ఆ ఒడంబడికను భారత కార్మికులు గుర్తించ నిరాకరించారు. సమ్మె పోరాటాలు యథాప్రకారం సాగుతూనే ఉన్నాయి. దోపిడీ, దారిద్ర్యాలే కార్మికవర్గాల్ని సమ్మెపోరాటాలకు ప్రోత్సహిస్తున్నాయి.

'సమ్మెలు దేశానికి హానికరం' అంటూ కార్మికులపై పోలీసులను ఉసికొల్పే ప్రభుత్వానికీ, పెట్టుబడిదారీ వర్గానికీ యీ జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసు నాయకులు ప్రక్కతాళం వేస్తున్నారు. కార్మికసంఘాలపై ముఖ్యంగా అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుపైనా, కమ్యూనిస్టుపార్టీపైనా నెహ్రూ-పటేల్ ప్రభుత్వం సాగించే క్రూర నిర్బంధ విధానాన్ని బలపరుస్తున్నారు.

నెలకొలది అరెస్టులూ, లాఠీలూ తుపాకులూ అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసునువిధ్వంసం చేయలేకపోయాయి. అయినా ఇండియాఅభివృద్ధినిరోధకులు తమ కుట్రలను తమ ఒక్కదేశంలోనే కాకుండా ఇతరదేశాలకుకూడా ప్రాకించ జూస్తున్నారు. బ్రిటిష్ - అమెరికా సామ్రాజ్యవాదుల సహకారంతో యీ విధంగా తమ 'అంతర్జాతీయ ప్రతిష్ఠను'ను అభివృద్ధి చేసుకోవాలనుకుంటున్నారు. గత జూలై నెలలో భారత ప్రభుత్వాధికారులు పంపిన లెక్కల 'ఆధారం'పై భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసునే భారతకార్మిక వర్గ ప్రతినిధిగా ఐ. యల్. ఓ. గుర్తించింది. ఈ బాపతుకు చెందిన సంఘాలతోనూ వాటి నాయకులతోనూ సంబంధాలు పెట్టుకోడానికి జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడైన శాస్త్రి అమెరికాలోనూ పశ్చిమయూరప్ దేశాల్లోనూ మూడుమాసాలు పర్యటన సాగించాడు. కార్మికోద్యమ విచ్ఛిన్నతలో వాసికెక్కిన అమెరికా ట్రేడ్ యూనియన్ నాయకులసలహా సంప్రదింపులతో సమ్మెవిచ్ఛిన్నకారిఅయిన ఆసియా ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ నిర్మాణానికి ప్లానులు వేశాడు. ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌ను విధ్వంసం చేయాలని బ్రిటిష్, అమెరికన్ ట్రేడ్ యూనియన్ నాయకులు మరొక అంతర్జాతీయ కార్మికసంస్థను నిర్మించేందుకు నానావస్థపడుతున్నారు. పోలీసుబలంతో నెలకొల్పబడే ఇలాంటి సంఘాలన్నీ వాళ్ళకు చక్కగా ఉపయోగిస్తాయి. ఆసియాఅంతటా విజృంభిస్తోన్న ప్రజాస్వామికోద్యమాన్ని అరికట్టేందుకు ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు వేసే ప్లానుల్లో ఈ కార్మికోద్యమ విచ్ఛిన్నత కూడా ఒకభాగమే. ఆసియా ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ నిర్మాణంలోని అంతరార్థంకూడా ఇదే.

—న్యూటైమ్సు 4-5-49






బ్రిటిష్ కామన్‌వెల్తులోకి ఇండియా ప్రవేశం

"క్రాస్ రోడ్సు" నుండి

# ప్రపంచ శాంతిమహాసభ విశేషాలు ★

ప్రపంచశాంతి మహాసభ ఏప్రిల్ నెల 20 వ తేదీనుండి 25 వ తేదీవరకూ పారిస్ మహానగరంలో జరిగింది.

63 దేశాలనుండి 1784 గురు ప్రతినిధులు మహాసభలో పాల్గొన్నారు. ఈసమావేశంలోనికి 16 అంతర్జాతీయసంస్థల నుండి 61 మంది ప్రతినిధులు హాజరయ్యారు. 46 దేశాలలోని 454 జాతీయ సంస్థలు శాంతిమహాసభకు అనుబంధ శాఖలుగా చేరాయి. కాని ఆయానిరంకుశ ప్రభుత్వాల నిషేధాజ్ఞలు మూలంగానూ, యింకా యితర కారణాలమూలంగాను ప్రతినిధులను పంపలేక పోయాయి.

ఈ సంస్థలు మొత్తం మీద 60కోట్ల ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించుతాయి.

ప్రపంచ మహాసభకు హాజరు కావడానికి వచ్చిన కొంతమంది ప్రతినిధులపై పారిస్‌కు రాకూడదని ఫ్రెంచిప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీచేసింది. అందువలన పారిస్ మహాసభతో పాటు అదే సమయంలో ప్రాగ్ నగరంలో మరొక

★ పారిస్‌లో జరిగిన ప్రపంచ శాంతి మహాసభను గురించిన రిపోర్టును బూర్జువా పత్రికలు ప్రచురించ నిరాకరించి తమ సామ్రాజ్యవాద బూర్జువా పక్షపాత బుద్ధిని ప్రదర్శించాయి. ప్రఖ్యాత సోవియట్ వారపత్రిక "న్యూటైమ్సు" మే 4వ తేదీ వెలువడిన తన 19వ సంచికతోబాటు శాంతి మహాసభలో జరిగిన ఉపన్యాసాలనూ, యితర విశేషాలను వివరించుతూ 60 పేజీల అనుబంధాన్ని ప్రకటించింది. సంచిక వెల ఆరణాలు.

ప్రతులకు: లీలా బుక్ డిపో [illegible] వాడ 2, పీపుల్సు పబ్లిషింగ్ హౌస్, పురుషోత్తమ బిల్డింగ్ [illegible] ంచి) మద్రాసు.

సమావేశాన్ని ఏర్పాటుచేశారు. పారిస్‌కు రావడానికి వీలుపడని ప్రతినిధులు యీ సమావేశానికి హాజరయ్యారు,

ప్రాగ్ సమావేశంలో జరిగిన శాంతి మాహాసభకు 178 ప్రతినిధులు హాజరయ్యారు. ఇందులో సోవియట్ యూనియన్ నుండి వచ్చిన వారు 10 మంది చైనా నుండి 44 గురు, మంగోలియా ప్రజా రిపబ్లిక్‌నుండి ముగ్గురూ, యింకా జర్మనీ, ప్రజాతంత్ర స్పెయిన్, కొరియా రిపబ్లిక్, గ్రీస్ వియత్‌నామాలనుండి వచ్చిన ప్రతినిధులూ వున్నారు.

మహాసభను చెకోస్లోవేకియా నేషనల్ అసెంబ్లీ అధ్యక్షుడు డాక్టర్ ఓల్డ్‌రిచ్ జాన్ ప్రారంభించాడు.

ఈ సమావేశంలో పాల్గొన్న సభ్యులు పారిస్ మహాసభ ప్రతినిధులకు తమ హృదయపూర్వక అభివందనాలను పంపించుతూ, యీసమావేశం పారిస్‌లో జరుగుతున్న ప్రపంచ శాంతి మహాసభ అంతర్భాగమేనని ప్రకటించారు. పారిస్ మహాసభ ఎజెండాలో ఉదహరించిన ప్రధాన హంశాలనే చర్చించి తీర్మానాలు చేశారు.

పారిస్‌లో ప్రపంచ శాంతి మహాసభ జయజయధ్వానాల మధ్య సరిగా 20వ తేదీ 11 గంటలకు ప్రారంభమైంది. సమావేశకర్తలు ప్రతినిధుల హర్షధ్వానాల మధ్య వేదిక నలంకరించారు.

అందులో యీక్రింది ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులున్నారు.

ఫ్రెడరిక్ జూలియట్ క్యూరీ (ప్రపంచప్రఖ్యాత ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు), లూయీ ఆరగాన్ (ఫ్రెంచి కవి) మార్టిన్ ఆండర్‌సన్‌క్స్ (డెన్‌మార్క్) జె. డి. బెర్నాల్ (బ్రిటన్) మదాం ఎగ్నికాటన్ (అంతర్జాతీయ ప్రజాతంత్ర మహిళా ఫెడరేషన్) అలెగ్జాండర్ ఫెడెయేవ్, వాండా వాస్సిలెవస్కీ అలెగ్జాండర్ కార్మిన్ చూక్ పి. పెడోసెయేవ్ (సోవియట్ యూనియన్) పిట్రోనెన్ని (ఇటలీ) డాక్టర్ హావలెట్ జాన్సన్ (బ్రిటన్) ఆర్‌బర్ట్‌కాక్ (అమెరికా మొదలగువారు.

మహాసభను ఫ్రెడరిక్ జూలియట్ క్యూరీ ప్రారంభించాడు.

అయిదురోజు

జరిగాయి. ఒక

శాంతి

దిం

వివిధ సంస్థల కృషిని సంఘటిత పరచేందుకు 140 మంది ప్రతినిధు లతో కూడిన ఒక ప్రపంచ శాంతి కాముకుల కమిటీని ఏర్పాటు చేశారు. ఇందులో ఇండియా తర ఫున సుప్రసిద్ధ పత్రికారచయిత పెల్వాంకర్ నియమించ బడ్డాడు.

## మహాసభకు వ్యతిరేకంగా సామ్రాజ్య వాదుల కుట్రలు

ఇంతమంది ప్రసిద్ధ ప్రపంచమే ధావులతో కూడిన మహాసభ యింతవరకెప్పుడూ జరిగి వుండ లేదు. ఈ మహాసభ జరుగకుండా చేయడానికి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు తీవ్రంగా ప్రయత్నించారు.

అనేకపెట్టుబడిదారీ దేశాలు ఇండియాతో సహా తమ దేశాల నుండి శాంతిమహాసభకు ప్రతి నిధులను వెళ్లకుండా చేశాయి. ఇన్నిచేసినా వారి ప్రయత్నాలు విఫలమయ్యాయి. చివరకు పారిస్ లోనే ఒకపోటీ ప్రపంచ శాంతి మహాసభ ఏర్పాటు చేయడానికి ... జరిగాయి: ఇందు ... అమెరికా ... చేశారు. ...

ఆఖరుకు కొంతమంది ప్రతి నిధులు రాకుండా ఫ్రెంచి అభి వృద్ధి నిరోధక ప్రభుత్వం నిషే ధాజ్ఞలను జారీచేసింది. దీనికి జవా బుగా వారంతా అదే సమయంలో ప్రాగ్‌లో సమావేశమై విచ్ఛిన్నకు లకు బుద్ధిచెప్పారు.

చిట్టచివరకుసామ్రాజ్యవాదులు ఏమీ చేయలేక మహాసభ విశే షాలు ప్రజలకు తెలియకుండా చేయాలని ప్రయత్నించారు.

నిష్పక్షపాతంగా వుంటామని ప్రతిదినమూ డబ్బాకొట్టుకొనే సామ్రాజ్యవాద- బూర్జువా పత్రి కలు ప్రపంచ శాంతి మహాసభ వార్తలు ప్రచురించ నిరాకరిం చాయి. పారిస్‌లో ప్రాగ్‌లో జరి గిన విషయాలను బహుళ ప్రజా నీకానికి తెలియనీకుండాచేద్దామను కున్నారు.

కానిశాంతి మహాసభ సందేశం ప్రపంచమంతటా ప్రతిధ్వనించింది

మహాసభలో ప్రతినిధులు చేసిన ప్రసంగాలు ప్రపంచ మంతటా ప్రతిధ్వనించాయి. వారెన్ని అడ్డంకులుపెట్టినా పెట్టు బడిదారీ ప్రపంచంలో వున్న ప్రజలకు సహితం యివిచేరాయి.

సమావేశాన్ని ఏర్పాటుచేశారు. పారిస్‌కు రావడానికి వీలుపడని ప్రతినిధులు యీ సమావేశానికి హాజరయ్యారు,

ప్రాగ్ సమావేశంలో జరిగిన శాంతి మహాసభకు 178 ప్రతినిధులు హాజరయ్యారు. ఇందులో సోవియట్ యూనియన్ నుండి వచ్చిన వారు 10 మంది చైనా నుండి 44 గురు, మంగోలియా ప్రజా రిపబ్లిక్‌నుండి ముగ్గురూ, యింకా జర్మనీ, ప్రజాతంత్ర స్పెయిన్, కొరియా రిపబ్లిక్, గ్రీస్ వియత్‌నామాలనుండి వచ్చిన ప్రతినిధులూ వున్నారు.

మహాసభను చెకోస్లోవేకియా నేషనల్ అసెంబ్లీ అధ్యక్షుడు డాక్టర్ ఓల్డ్‌రిచ్‌జాన్ ప్రారంభించాడు.

ఈ సమావేశంలో పాల్గొన్న సభ్యులు పారిస్ మహాసభ ప్రతినిధులకు తమ హృదయపూర్వక అభివందనాలను పంపించుతూ, యీసమావేశం పారిస్‌లో జరుగుతున్న ప్రపంచ శాంతి మహాసభ అంతర్భాగమేనని ప్రకటించారు. పారిస్ మహాసభ ఎజెండాలో ఉదహరించిన ప్రధాన హంశాలనే చర్చించి తీర్మానాలు చేశారు.

పారిస్‌లో ప్రపంచ శాంతి మహాసభ జయజయధ్వానాల మధ్య సరిగా 20వ తేదీ 11 గంటలకు ప్రారంభమైంది. సమావేశకర్తలు ప్రతినిధుల హర్షధ్వానాల మధ్య వేదిక నలంకరించారు.

అందులో యీక్రింది ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులున్నారు.

ఫ్రెడరిక్ జూలియట్ క్యూరీ (ప్రపంచప్రఖ్యాత ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు), లూయీ అరగాన్ (ఫ్రెంచి కవి) మార్టిన్ ఆండర్‌సన్‌క్సో (డెన్‌మార్క్) జె. డి. బెర్నాల్ (బ్రిటన్) మదాం ఎగ్నికాటన్ (అంతర్జాతీయ ప్రజాతంత్ర మహిళా ఫెడరేషన్) అలెగ్జాండర్ ఫెడెయేవ్, వాండా వాస్సిలెవస్కీ అలెగ్జాండర్ కార్నిన్ చూక్ పి. పెడోసెయేవ్ (సోవియట్ యూనియన్) పిట్రోనెన్ని (ఇటలీ) డాక్టర్ హెవలెట్ జాన్సన్ (బ్రిటన్) ఆర్‌బర్ట్‌కాక్ (అమెరికా మొదలగువారు.

మహాసభను ఫ్రెడరిక్ జూలియట్ క్యూరీ ప్రారంభించాడు.

అయిదురోజు[illegible]
జరిగాయి. ఒక[illegible]
శాంతి [illegible]
దిం[illegible]

వివిధ సంస్థల కృషిని సంఘటిత పరచేందుకు 140 మంది ప్రతినిధులతో కూడిన ఒక ప్రపంచ శాంతి కాముకుల కమిటీని ఏర్పాటు చేశారు. ఇందులో ఇండియా తరఫున సుప్రసిద్ధ పత్రికారచయిత షెల్వాంకర్ నియమించ బడ్డాడు.

## మహాసభకు వ్యతిరేకంగా సామ్రాజ్య వాదుల కుట్రలు

ఇంతమంది ప్రసిద్ధ ప్రపంచమేధావులతో కూడిన మహాసభ యింతవరకెప్పుడూ జరిగి వుండలేదు. ఈ మహాసభ జరుగకుండా చేయడానికి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు తీవ్రంగా ప్రయత్నించారు.

అనేక పెట్టుబడిదారీ దేశాలు ఇండియాతో సహా తమ దేశాల నుండి శాంతిమహాసభకు ప్రతినిధులను వెళ్లకుండా చేశాయి. ఇన్ని చేసినా వారి ప్రయత్నాలు విఫలమయ్యాయి. చివరకు పారిస్ లోనే ఒకపోటీ ప్రపంచ శాంతి మహాసభ ఏర్పాటు చేయడానికి ... జరిగాయి: ఇందు ... అమెరికా ... చేశారు. ...

ఆఖరుకు కొంతమంది ప్రతినిధులు రాకుండా ఫ్రెంచి అభివృద్ధి నిరోధక ప్రభుత్వం నిషేధాజ్ఞలను జారీచేసింది. దీనికి జవాబుగా వారంతా అదే సమయంలో ప్రాగ్‌లో సమావేశమై విచ్ఛిన్నకులకు బుద్ధిచెప్పారు.

చిట్టచివరకుసామ్రాజ్యవాదులు ఏమీ చేయలేక మహాసభ విశేషాలు ప్రజలకు తెలియకుండా చేయాలని ప్రయత్నించారు.

నిష్పక్షపాతంగా వుంటామని ప్రతిదినమూ డబ్బాకొట్టుకొనే సామ్రాజ్యవాద- బూర్జువా పత్రికలు ప్రపంచ శాంతి మహాసభ వార్తలు ప్రచురించ నిరాకరించాయి. పారిస్‌లో ప్రాగ్‌లో జరిగిన విషయాలను బహుళ ప్రజానీకానికి తెలియనీకుండాచేద్దామనుకున్నారు.

కానిశాంతి మహాసభ సందేశం ప్రపంచమంతటా ప్రతిధ్వనించింది

మహాసభలో ప్రతినిధులు చేసిన ప్రసంగాలు ప్రపంచమంతటా ప్రతిధ్వనించాయి. వారెన్ని అడ్డంకులుపెట్టినా పెట్టుబడిదారీ ప్రపంచంలో వున్న ప్రజలకు సహితం యివిచేరాయి.

"శాంతికోసం జరిగే పోరాటంలో ధైర్యాన్ని విశ్వాసాన్ని కలిగివుండండి! ఎలా ఐక్యం కావాలో మనకు తెలుసు. ఏవిధంగా ఒక అంగీకారానికి రావాలో కూడా మనకు తెలుసు. శాంతికోసం–జీవితం కోసం జరిగే యీ మహాపోరాటంలో విజయం పొందడానికి కృతనిశ్చయులమై సన్నద్ధమవుతున్నాం."

పారిస్ మహాసభ పిలుపు ప్రపంచమంతటా ప్రతిధ్వనించుతోంది. అన్ని దేశాలలో ఎన్నడూ లేనంత ఉత్సాహంతో జరిగిన యీ సంవత్సరం మేడే ప్రదర్శనాలు శాంతి సంస్కృతుల సంరక్షణకు సంసిద్ధపడుతున్న కోటానుకోట్ల ప్రజల కృతనిశ్చయాన్ని స్పష్టంగా ప్రకటించాయి.

* * *

ప్రపంచశాంతి మహాసభలో నియమించబడిన శాశ్వతకమిటీ సమావేశమై యీ క్రింది వారిని కార్యనిర్వాహకులుగా ఎన్నుకున్నది.

అధ్యక్షుడు :

ప్రొఫెసర్ జ్యూలియట్ క్యూరీ. నోబుల్ బహుమతి పొందిన ప్రపంచ ప్రఖ్యాత ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు. ఈయన భార్య, కుమార్తెకూడా శాస్త్ర పరిశోధనకు నోబుల్ బహుమానాలను పొందారు.

ఉపాధ్యక్షులు:

ఎగ్నీకాటన్
(అంతర్జాతీయ ప్రజాతంత్ర మహిళా ఫెడరేషన్ అధ్యక్షురాలు)

లూయీ సాయివెంట్
(ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి)

గై డి బాయిసన్
(ప్రపంచ ప్రజాతంత్ర యువజన ఫెడరేషన్ అధ్యక్షుడు)

లూయీ ఆరగాన్
(ఫ్రెంచి మహాకవి)

పిట్రో నెన్నీ (ఇటలీ సోషలిస్టు నాయకుడు)

ప్రొఫెసర్ జె. డి. బెర్నల్.
(బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు)

అలెగ్జాండర్ ఫెడయేవ్
(సోవియట్ రచయిత)

ఓ. జాన్‌రోగ్గి.
(అమెరికన్ అటార్నీ)

కో–మో–జో (చైనా రచయిత)

గ్రబెయిల్ డి. అ. బోస్సూర్

లాజరో కార్డెనాస్
(మెక్సికన్ రిపబ్లిక్ మాజీ అధ్యక్షుడు)

ప్రధాన కార్యదర్శి :

జీన్ లాఫిట్టే
(ఫ్రెంచి రచయిత)

# గ్రంథ సమీక్ష

## వలసదేశాలా, అర్ధస్వతంత్ర వలసదేశాల్లోని విప్లవోద్యమం

వెల : 1-4-0

ఇది 1928 లో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టుసంస్థ ఆరవ కాంగ్రెసు ఆమోదించిన థీసిస్. ఇది తయారుచేసి 21 సంవత్సరాలైంది. అయినా ఈ థీసిస్ విలువ ఈనాడు మరింత హెచ్చింది.

గత 21 సంవత్సరాల చరిత్రా యీ థీసిస్‌యొక్క సక్రమత్వాన్నీ, సవ్యత్వాన్నీ స్పష్టంగా ఋజువు చేసింది: ముఖ్యంగా వలసదేశాలలోని రైతాంగంయొక్క దుర్భర పరిస్థితులు వ్యావసాయిక విప్లవం వల్ల తప్ప తొలగించడం సాధ్యంకాదు అనే విషయాన్ని ఆనాడే స్పష్టపర్చింది. అంతేగాకుండా వ్యావసాయిక విప్లవం పట్ల బూర్జువావర్గం అవలంబించే వైఖరిని కూడా దర్శించింది. “ఇండియా, చైనా, ఈజిప్టులలో బూర్జువావర్గం తన తాత్కాలిక ప్రయోజనాలవలన భూస్వాములతోటీ, వడ్డీవ్యాపారులతోటీ, సర్వసాధారణముగా రైతాంగాన్ని దోచుకునే వారందరితోటీ సన్నిహితంగా కట్టుబడియున్నది. అందువల్ల అది రైతు స్థితి చక్కబర్చగల పెద్ద సంస్కరణ దేనికైనా వ్యతిరేకిస్తుంది. అందా[illegible] అఖిలేమ. వ్యవసాయ సమస్యా స్వరూపాన్ని బహిరంగంగావివరించటమన్న దానికి భయమే.”

ఇవి అక్షరాలా నిజం అని కాంగ్రెసు నాయకత్వం అధికారానికి రాకపూర్వం, తర్వాత తీసుకున్న ప్రతిచర్యా తెలియజేస్తుంది. నేడు వాస్తవంగా రైతు సమస్యలు పరిష్కరించుకునే తెలంగాణా వీర రైతాంగంపై కాంగ్రెసు ప్రభుత్వం కత్తి కట్టడం, ‘జమీందారీ రద్దుబిల్లు’ లంటూ కపటనాటకాలాడటం, గమనించిన ప్రతి ఒక్కరూ పై ఉద్బోధ యాదార్థ్యాన్ని గ్రహిస్తారు.

వలసదేశాల విప్లవాలను - అగ్రగామిగా నిలబడి పనిచేయాల్సిన శ్రామికవర్గం, బూర్జువావర్గానికీ, శ్రామికవర్గానికీ మధ్య నిర్మాణరీత్యా హద్దులను ఏర్పర్చుకోవాలనీ ముఖ్యమైన వ్యావసాయిక విప్లవ నినాదాలీయాలనీ, 1925-27 లలో చైనా కమ్యూనిస్టుపార్టీ చేసిన తప్పిదాల నుంచీ పై గుణపాఠాలు నేర్చుకోవాలనీ నిర్దేశించింది.

“కమ్యూనిస్టులు ఈదశలో జాతీయోద్యమాన్ని నడిపే బూర్జువా సంస్కరణవాద నాయకత్వంయొక్క నిజస్వరూపాన్ని వెల్లడిచేయటంలో ఇప్పటికప్పుడే కృతకృత్యులై యుండకపోతే, ఈ సంస్కరణవాద నాయకత్వం ముందురాగల విప్లవ తరంగం విజృంభించే సమయంలో విప్ల

వానికి మహా ప్రమాదంగా పరిగణించగలరు...ముందు ముందు వీరు (ఈ బూర్జువాపార్టీలు) విప్లవ ప్రతీఘాత శిబిరంలో చేరటం తథ్యం" అని ఇండియా మొదలైన దేశాల కమ్యూనిస్టుపార్టీలను హెచ్చరించింది. భారత కమ్యూనిస్టు పార్టీ కలకత్తాలో జరుపుకున్న ద్వితీయ కాంగ్రెసులో నిర్ణయించిన రాజకీయ విధానం పై హెచ్చరికనే గుర్తుకు తెచ్చింది. నేటి భారతదేశం సోషలిజం వైపుకు పురోగమించాలంటే ఈ ఆరవకాంగ్రెస్ థీసిస్‌ను ప్రతి రాజకీయవేత్తా శ్రద్ధగా పరిశీలించి ప్రస్తుత పరిస్థితులకు జోడించి అమలుజరిపినప్పుడే సాధ్యమౌతుంది.

## ఆస్తి - దానిపరిణామం

రచన: పాల్ లెఫార్గ్

అనువాదం: రామారావు

**వెల 1_12_0**

"ఉత్పత్తి విధానం సామాన్యంగా మానవుని సామాజిక, రాజకీయ, వైజ్ఞానిక రూపాల్ని నిర్ణయిస్తుంద"ని మార్క్స్ మహాశయుడు ప్రవచించాడు. వివిధదశలలో మానవు లుపయోగించిన ఉత్పత్తి పరికరాలూ, ఉత్పత్తి శక్తులతో వాటికున్న సంబంధం ఇదే మానవచరిత్రకు ముఖ్యాధారమని ఆయన బోధించాడు. అయితే ఈ వాదాన్ని అంతా దైవనిర్మితం అనుకునే భావవాదులు అంగీకరించరు. వీరితోబాటు ప్రజాసామాన్యానికి క్లిష్ట సమయాలలో దారిచూపటానికి బదులు 'నవ్యమానవత్వపు' గోతులు చూపే పలాయనబుద్ధులూ, మిథ్యా మేథావులూ ముఖ్యంగా ఈనాడు పై మార్క్స్ వాదాన్ని దుయ్యబట్టుతున్నారు. 'ఉత్పత్తి విధానంతో పాటు సమాజంలోని నైతిక సూత్రాలుకూడా మారుతాయి' అనే మార్క్సిస్టు సూత్రానికి - 'కమ్యూనిస్టు లెన్నిచెప్పినా వారికి నీతి నియమాలపై నమ్మకముండదు' అంటూ వక్రభాష్యాలు చెప్పి మార్క్సిజంపై అసత్య ఆరోపణలు చేస్తున్నారు కొందరు ప్రబుద్ధులు. వ్యక్తిగత ఆస్థిపద్ధతి అమలులో ఉండటంవలన కొద్దిమంది వ్యక్తులు సిరిసంపద లన్నిటినీ గుత్తకు తీసుకొంటే వస్తున్న వికృతపరిణామాలను అర్థం చేసుకోలేక, మానవు లందర్నీ ద్వేషిస్తూ కొందరు మేధావులు వాస్తవ జీవితంనుంచి పలాయనంచిత్తగించి రమణమహర్షి పాదాలు పట్టుతున్నారు.

ఈపుస్తకం పైతరగతికిచెందిన 'మేథావుల'కు వారి ప్రభావంలో పడినవారికీ చక్కటి జవాబిస్తుంది. ఆస్థిపై సమిష్టి హక్కు ననుభవించిన ఆదిమ కమ్యూనిస్టు సమాజంనుంచీ, వ్యక్తిగత ఆస్థియొక్క అత్యున్నత స్థితికిపోయిన బూర్జువాయుగం వరకు జరిగిన పరిణామాలను సోదాహరణంగా రుజువుచేశారు రచయిత.

అనువాదం జాగ్రత్తగా చేయబడింది. విజ్ఞానతృష్ణగల ఆంధ్రులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఆశిస్తాం.

## పెట్టుబడిదారీవిధానం దానిపరిణామం

**వెల రు 1_12_0**

లియోహ్యూబర్‌మన్‌యొక్క 'Man's worldly goods' అనే పుస్తకాన్ని అనుసరించి రామారావుగారు రచించిన పుస్తకమిది.

భూస్వామ్య విధానంయొక్క అంత్య దశనుండీ నేటి పెట్టుబడిదారీ విధానపు చరమదశవరకూ మానవసమాజం పొందిన వివిధపరిణామాలనూ 22 ప్రకరణాలలో చిత్రించారు రచయిత. చారిత్రక భౌతిక వాద దృక్పథంతో రచయిత చరిత్రగతిని పరిశీలించారు.

భూస్వామ్యవిధానంలోని తీవ్ర వైరుధ్యాలు సమాజ పురోగమనాన్ని అరికట్టాయి. వ్యవసాయికోత్పత్తిని మితం చేశాయి. దారిద్ర్యం దుర్భరమయింది. క్రమంగా పరిశ్రమలు హెచ్చాయి. పారిశ్రామికులు భూస్వామికవిధానాని కెదురుగా సంఘటితమయ్యారు. భూస్వామ్య విధానానికి విరుద్ధంగా తిరుగుబాటుచేసిన ఇతరవర్గాలన్నిటికీ పెట్టుబడిదారులు నాయకత్వంవహించారు. లాభాలకోసం సరుకులను ఉత్పత్తిచేసి స్వేచ్ఛగా మార్చుకునేందుకు అధికారం సంపాదించారు. అయితే భూస్వామ్య విధానంలోనివర్గాలు పెట్టుబడిదారీ విధానంలోకూడా వేరొక రూపంలో అంటే- పెట్టుబడిదారు, కార్మికుడూరూపంలో ప్రత్యక్షమయ్యాయి. సమాజావసరాలకుగాక వ్యక్తుల లాభాలకు ఉత్పత్తి జరగటం, ఉత్పత్తిశక్తులకు ఉత్పత్తి పరికరాలపై యాజమాన్యంలేక పోవటం ఇత్యాది వైరుధ్యాలు ఈ సమాజంలోకూడా నానాటా అభివృద్ధి చెందాయి. గుత్తవ్యాపారుల పెట్టుబడిదారులమధ్య అంతర్విరోధాలూ, యుద్ధాలకూ, ఆర్థిక క్లేశాలకూ, దారిద్ర్య కాటకాలకూ దారితీశాయి. భూస్వామ్య విధానం తన ఆంతరంగిక వైరుధ్యాలను పోదగడంతో పెట్టుబడిదారీ సమాజం వచ్చినట్లుగనే, పెట్టుబడిదారీ విధానాన్ని చీల్చుకుని సోషలిస్టు సమాజంవచ్చింది. అయితే ఈ సమాజాలు వాటంతట అవే పరిణామం చెందలేదు. ఆయావర్గాల బలాబలాలు తేల్చుకోటంతో ముఖ్యంగా కార్మికవర్గంయొక్క చరిత్రాత్మక కర్తవ్య నిర్వహణతోనే ప్రస్తుతం ఈ మార్పు జరుగుతుంది. ఈ సత్యాలను సమగ్రంగా కాకపోయినా ఒక స్పష్టమైన అభిప్రాయాన్ని ఇచ్చేటట్లు రచయిత ఈ పుస్తకంలో వివరించారు. మూలాన్ని అనుసరించడంలో రామారావుగారు జయప్రదమయ్యారనే చెప్పాలి.

మార్క్సిస్టు దృక్పథంతో చరిత్రను తెలుసుకోగోరే ప్రతి ఒకరూ ఈ పుస్తకం చదివితీరాలి.





## సవరణ

జనత 15 వ సంచికలో 71వ పేజీ రెండవ పేరాలో రెండవపంక్తి తల్లి పీనాసి. అని పడింది. పొరపాటు తండ్రి పీనాసి అని సవరించుకో కోరుతాం —సంపాదకవర్గం.



## మనవి

జనత 15 వ సంచికలో 57 వ పేజీనుండి 64 పేజీవరకున్న పేజీలు రెండుసార్లు కొన్ని ప్రతులలో వచ్చినట్లు మాకు పాఠకులనుండి లేఖలు వచ్చాయి. అది ప్రెస్‌లో జరిగిన పొరపాటు. మీకు రావలసిన పేజీలుకోసం మాకు వ్రాస్తే మేము తిరిగి పంపుతాం. ఈ పొరపాటుకు పాఠకులు క్షమిస్తారని ఆశిస్తాం.

భవదీయుడు,

మేనేజరు.

Bc



# PROGRESSIVE JOURNAL

## 1. NEW TIMES

A Soviet weekly devoted to questions of foreign policies of the Soviet Union and other countries; contains contributions by leading Soviet figures in all walks of life; coments on all important international events; reviews of all important books. It is a relentless fighter for the cause of peace and friendship among nations and a consistant supporter of all freedom - battles of all nations, big or small.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 13—8—0 | 6—12—0 | 0—6—0 |

## 2. SOVIET LITERATURE

A monthly magazine of Soviet Literature and Art contains Novels, Plays, Short Stories, Poems, Articles on literary criticism, reviews of Soviet books and films - written by leading Soviet writers...180-200 pages of reading.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 8—8—0 | 4—4—0 | 1—0—0 |

## 3. LABOUR MONTHLY

A magazine of international labour, edited by the eminent British Marxist, Rajani Palmi Dutt. Contains a monthly review of international developments, with particular reference to events in Britian.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 9—4—0 | 4—12—0 | 0—12—0 |

## 4. CHINA DIGEST

Published from Hong Kong, this fortnightly journal breaks through the curtain of American - Kuomingtang censorship and gives a true picture of the events in China.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 18—8—0 | 10—4—0 | 0—11—0 |

## 5. FOR A LASTING PEACE, FOR A PEOPLE'S DEMOCRACY

Fortnightly organ of the communist information bureau, published from Bucharest, Rumania.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 5—8—0 | 2—12—0 | 0—4—0 |

## 6. MASSES AND MAINSTREAM

A progressive literary monthly Published in U.S.A: contains contributions from leading American and world Writers, Poets, Critics & Artists. It will keep you in touch with the latest trends in the world of art and literature.

| 1 year | ½ year | 1 copy |
|---|---|---|
| 16—0—0 | 8—0—0 | 2—0—0 |

## 7. SOVIET LAND

A fortnightly journal, published from New Delhi by the Soviet News Agency "Tass". Contains articles & information on all aspects of Soviet life

| 1 year | ½ year | ¼ year | 1 copy |
|---|---|---|---|
| 6—0—0 | 3—8—0 | 2—0—0 | 0—6—0 |

We accept subscriptions for the above Journals. They will be remitted to the Publishers and the Subscribers will get their copies direct from the Publishers.

## PEOPLE'S PUBLISHING HOUSE Ltd., Bombay 4

Edited, Printed & Published by G. Venkateswara Rao Guntur, Printed at Kavitilaka Press, Vijayawada.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M116 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | C1, BC1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |